ఫిబ్రవరి 1984

148

# సృజన



# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

148 | మాసపత్రిక | ఫిబ్రవరి 1984



సంపాదకీయం 1

పాటలు : ఊరుమీద ఊరు - ఎర్రా సూరయ్య 5

అమరుడా లచ్చయ్య - ఎ. అప్పల్నాయుడు 31

మా భూమి - అల్లం రాజయ్య 32

బొంబాయి మిల్లుకూలోల్లం - వి. సత్యం 34

ఏయ్ ! హేయ్ !! ఐస.... - ఎన్నార్ 'భోలా' 35

పాలస్తీనా కవిత : నేలతల్లీ ! - అబూ సల్మా 30

కథ : దొంగగొడ్డుకు లొటారం - బి. ఎస్. రాములు 7

దృక్పథం: ఆదిలాబాద్ గిరిజన పోరాటాలు ఒక పరిశీలన-ఎ ఎస్. మైత్రి 37

సమీక్షలు: నిత్యసత్యశోధకుడు - రహి 53

జానపదగేయాలు - పరిశోధన - ప్రాణహిత 57

రిపోర్టు : విప్లవ రచయితల సంఘం పదవ రాష్ట్ర మహాసభలు 61

కరపత్రం: "అభివృద్ధి కార్యక్రమాలు" ఎందుకోసం ? 67

లేఖలు : నారాయణ, కాకరాల 71

ముఖచిత్రం : "అభ్యుదయ యాత్ర"


ఈ నెలనుంచి నిర్వహణతోపాటు సంపాదక బాధ్యతనుగూడ 'సాహితీ మిత్రులు' చేపట్టారు.


| నిర్వహణ | సృజన | ఈ సంచిక రు. 2 |
| --- | --- | --- |
| సాహితీ మిత్రులు | హనుమకొండ 506 001. | సంవత్సరచందా రు. 20 |

SRJANA is commended for use in Public Libraries in the Sate by the Director of Public Libraries, Andhra Pradesh, Hyd. Vide Ref. No. 182/A4/67, dated 22-9-1967.

Printed, Edited & Published by P. Hemalatha for 'Sahithee Mithrulu' Printed at Navatha Printers J. P. N. Road, Warangal - 506 002 for Venkataramana Mudranalayam, Warangal

## జనవరి సంచిక ఆలస్యానికి సంజాయిషీ

సృజన జనవరి '84 సంచిక ఎంతోఆలస్యంగా వెలువడినందుకు విచారిస్తున్నాం. అది జనవరి 10న విరసం శ్రీకాకుళ సభలనాటికే పూర్తయినా, ఫిబ్రవరి మొదటివారానికిగాని చందాదారులకూ, ఏజెంట్లకూ చేరలేకపోయింది.

వరంగల్‌లో ప్రింటింగ్ సాధ్యంకానిస్థితిలో జనవరి సంచికకోసం హైదరాబాద్ విజయ ఆర్ట్ ప్రింటర్స్‌కు వెళ్ళడం జరిగింది. తనది "కార్మికవర్గప్రెస్" అనీ "మనసాహిత్యం ఫ్రీగా ప్రింట్ చేసిస్తాన"నీ ఎప్పుడూ చెపుతూఉండే ఈ ప్రెస్ యజమాని ప్రింటింగ్ మొదట్లో మాట్లాడిందానికి పొంతనలేకుండా బిల్ వేశాడు. అలా మోసపుబిల్ వేయడమేగాక, ఆ మోసాన్ని పట్టుకోకుండా ఉండేందుకుగాను మొత్తం బిల్‌డబ్బు ఇచ్చేవరకూ సృజన ప్రెస్‌నుంచి బైటికి కదలనివ్వనని చెప్పాడు. ఆటోలోవేసిన బండిల్స్ దింపేయించాడు.

"కార్మికవర్గ" ప్రెస్‌యజమాని "కార్మికనాయకుడు" చేసినమోసానికిగురై ఆ రకంగా సృజన పూర్తయ్యాక 20 రోజులు ఆలస్యంగా వెలువడవలసి వచ్చింది. కారణంఏదైనా బాధ్యత మాదేకనుక ఈ అసౌకర్యానికి క్షమించవలసిందిగా పాఠకులను, చందాదారులనూ, ఏజెంట్లనూ కోరుతున్నాం.

— 'సాహితీమిత్రులు'

## కలాలకు విగళాలు

ఈ సంచికలో 'దొంగగొడ్డుకు లొటారం' కథరాసిన కామ్రేడ్ బి. ఎస్. రాములు విరసం కార్యవర్గ సభ్యుడు. సృజన 80 డిసెంబర్‌లో ఇతని 'తిరుగుబాటు' అనే కథ ప్రచురింపబడింది. వేరేపత్రికల్లోనూ కొన్నికథలు వెలువడినాయి. కరీంనగర్ బుక్‌ట్రస్ట్ 1982లో ప్రచురించిన ఇతని 'బతుకుపోరు' నవల బీడీకార్మికుల జీవితాన్ని చిత్రించి అశేష ప్రజాదరణ పొందింది.

వృత్తిరీత్యా బి ఎస్ రాములు కరీంనగర్‌జిల్లా మల్యాల ఎస్. సి. హాస్టల్ వార్డెన్. ఆయనను 23 జనవరి సోమవారం మధ్యాహ్నం జగిత్యాలలో ఆయన ఇంటివద్ద పోలీసులు అరెస్టు చేసారు. ఇంట్లోనే కొట్టారు. జీప్‌లో కొడుతూ పోలీస్ స్టేషన్‌కు తీసుకుపోయారు. జగిత్యాలలో కోరుట్లలో పోలీసుస్టేషన్లలో రోకలిబండలు ఎక్కించి కొట్టారు. మల్యాల తీసుకువెళ్ళి హాస్టల్‌లో ఆయన పిల్లలముందు ఆయనను, కొందరుపిల్లలను కొట్టారు. 29.1. ఆదివారందాకా అక్రమనిర్బంధంలో వుంచారు. 'ప్రేమకథలో, డిటెక్టివ్ కథలో రాసుకోక విప్లవ కథలెందుకు రాస్తావ'ని హితవు చేసారు. ఈ 'ట్రీట్‌మెంట్'అంతా కథగా రాసుకొమ్మని, అది తమకు ప్రమోషన్ తెస్తుందనికూడ బెదిరింపులాంటి కోరికకోరారు. ఆయనవద్ద బాంబులు దొరికాయని కేసుపెట్టి 30వ తేదీన కరీంనగర్ జైలుకు పంపించారు. ఇప్పటికింకా ఆయనకు బెయిలురాలేదు.

ఈ అరెస్టు, చిత్రహింసలు, అక్రమ నిర్బంధం, అబద్ధపుకేసు- అన్నీ భావప్రకటనా స్వేచ్ఛను గౌరవించే ప్రతిరచయితా, ప్రజాస్వామ్యవాదీ ఖండించాలని విజ్ఞప్తి చేస్తున్నాం.

— సా. మి.

# ప్రజలారా! పోరాటంకావాలా? అభివృద్ధికావాలా? తేల్చుకోండి.

తెలంగాణా గ్రామాల్లోకి సి. ఆర్. పి. బెటాలియన్లుదిగి క్యాంపులు పెట్టాక వరంగల్ జిల్లాలో "అభ్యుదయయాత్రలు" ప్రారంభించారు జిల్లా అధికారులు. జిల్లా అధికారులంటే డిఐజి పోలీసు, జిల్లాకలెక్టర్, జిల్లాఎస్‌పి, జిల్లాపరిషత్ ఛైర్మన్, ఇతర జిల్లాఅధికారులు. అయితే అనివార్యంగా సిఆర్‌పి క్యాంపులువున్న గ్రామాలకు మాత్రమే ఈ 'అభ్యుదయయాత్ర'లు.

సింగరాజుపల్లిలో ఇదివరకు వేయిరూపాయిలకు గుడిసెచొప్పున నిర్మించిన వానిలో ముప్పయ్యొక్కటి కూలిపోయాయట. వాటిస్థానంలో ఆరువేల రూపాయల చొప్పున ముప్పైఒక్క ఇళ్ళ నిర్మించడానికి ఎస్పీ శంకుస్థాపన చేసాడు. దాదాపు ఏడులక్షల రూపాయలతో నిర్మాణమయ్యే పాల్ట్రీకాంప్లెక్సుకు లేదెళ్ళలో ఛైర్మన్ శంకుస్థాపన చేసాడు. దామెరలో ఎనభైఅయిదు ఇళ్ళకాలనీకి లేదెళ్ళలో ఇరవై వేలతో నిర్మించే పాఠశాలగది నిర్మాణానికి జిల్లాకలెక్టర్ పునాదిరాయి వేసాడు.

ఈ అభివృద్ధి కార్యక్రమాల్లో రెండుఅంశాలువున్నాయి. ఒకటి, ఇప్పటికైతే ఇది పునాదిరాళ్ళ అభివృద్ధి. రెండవది ఇవన్నీ గ్రామాల్లోని భూమిలేని నిరుపేదలకు నేరుగా భూమి, వ్యవసాయపనిముట్లు, ఎరువులు, విత్తనాలు, పశువులు ఇవ్వడం వంటి ప్రయోజనకరమైన పనులుకావు. దళారీలు, కంట్రాక్టర్లు మరింతబాగుపడేవని, కనుక జిల్లాఅధికారులు యాత్రచేసి వేసింది పునాదిరాళ్ళే. ఇంక ఆ గ్రామాలనుంచి గానీ, ఆ గ్రామాలకుగానీ 'యాత్ర'చేసి 'అభ్యుదయం' సాధించేదంతా కంట్రాక్టర్లు, దళారీలు. గ్రామాల్లోదళారీలుగా, కంట్రాక్టర్‌లుగా. ఎవరు అవకాశాలు లైసెన్సులు పొందగలరో ఊహించడం కష్టంకాదు. తమకు రాడికల్స్‌తో సంబంధం లేదని ప్రకటించిన కులంచెడ్డ ఏడుగురు యువకులకుసుఖం దక్కుతుందని కూడా చెప్పలేం. కోళ్ళపెంపకంషెడ్లు షెడ్యూల్డు కులాలవారికేఅయినా అందుకయ్యే ఖర్చు వాళ్ళచేతికివ్వరు. (వాళ్ల తాగిపాడుచేసుకుంటారని క్లబ్బులల్లో, ప్రైవేట్‌పార్టీల్లో పబ్లిగ్గానూ తాగేఅధికారులకు అనుమానం- అనుమానమేమొచ్చె- నమ్మకంగాతెలుసు)

వెయ్యిరూపాయల గుడిసెలు గాలికిపోయాయి. ఆరువేలఇళ్ళ (అందులో కంట్రాక్టర్ ఐదువేళ్ళ జేబులోకిపోతాయి.) వానలకిపోవని గ్యారంటీలేదు. కట్టి కట్టకముందే పగుళ్ళువారి, గాలి, వెలుగు, నీళ్ళులేక దోమలతో, ఈగలతో, రొష్టుతో ఊపిరాడక జనం ఆ ఇళ్ళలో వుండకపోతే అనాగరికులైన అలగాజనం అభ్యుదయంనిచ్చిన ఎక్కిద్దామన్నా నేలమీదకూలబడే అనాగరికులనుకోవలి.

అయితే తక్షణఫలితాలు ఏవీలేవనిచెప్పడం అభ్యుదయం విషయంలో కమ్యూనిస్టు గుడ్డితనం అవుతుంది.

బడిపిల్లలకు పుస్తకాలు, పలకసంచులు పంచారు, ఇద్దరు వికలాంగులకు మూడువందల రూపాయల స్కాలర్‌షిప్ ఇచ్చారు. మరికొన్ని బ్యాంకు అప్పులు ఇప్పించారు.

'ప్రజలకు ప్రభుత్వ కార్యక్రమాల సమాచారం అందుబాటులో లేకపోవడం వల్ల అనర్థాలు వాటిల్లుతాయని' చైర్మన్ వాపోయాడు. ఇపుడింక ప్రభుత్వ కార్య క్రమాల సమాచారం ఏమొచ్చె- ఫలితాలే గ్రామాల్లోప్రజలు పిఆర్‌పిఎఫ్‌ద్వారా తెలుసుకుంటారు. కనుక అనర్థాలకు చోటుండదు. అనర్థాలు, అర్థసత్యాలూకాదు, ప్రజలింక నగ్నసత్యాలు తెలుసుకుంటారు.

జిల్లాలో వెనుకబడినవారి సంక్షేమంకోసం ముప్పైకోట్లు ఖర్చుపెట్టినామని, ప్రభుత్వం పెడుతున్న ఖర్చునుచూపి అభివృద్ధిని అంచనా చేసుకొమ్మంటున్నాడు కలెక్టర్.

కనుక "అభివృద్ధికావాలా? పోరాటంకావాలా? తేల్చుకోమని ఎస్ పి శ్రీ రామావతార్ యాదవ్ ప్రజలను కోరారు".

ఇదినిజంగా ప్రజలు తేల్చుకోవాల్సిన విషయం. పైకిచూడ ఇందులో రెండు మార్గాల్లో- అవికూడా పరస్పర భిన్నమైనమార్గాల్లో, ఒకటి పూర్తిమంచి, మరొకటి పూర్తి చెడు మార్గాల్లో- ఏదోఒకటి ఎంచుకోవడంగా కనిపిస్తుందికానీ ఇది ముద్దో లాతీదూర్చి కడుపును సంస్కరించేంత క్లిష్టమైన సమస్య. లాకప్పులో రామామననానే నోటికి మూత్రమందించే, అకలనగానే మలంతినిపించే అంతస్సులభమైన పనికాదు. చేతులువిరగ్గొట్టి వికలాంగులకు పదిహేనువందల పారితోషికం ఇచ్చేమాట. గోళ్లూడ గొట్టి వేళ్ళకు అహింసనేర్పేబాట.

"అన్యాయాలను వేలెత్తిచూపితే వ్యతిరేకవర్గంవాడు తమను రాడికల్సని వేధించినట్లూ", పోలీసుస్టేషన్‌నుంచి పోలీసుస్టేషనుకు తిప్పుతూ మాములుగా క్యాంపులో కోటింగుఇచ్చినట్లూకాదు. ఆ వ్యతిరేకవర్గంవాడే జిల్లాఅధికారుల సరసన వేదికఇచ్చి మైక్‌ఇచ్చి (అందులోనూ కాలేజీల్లోనే 144 సెక్షన్‌వున్న ఈ రోజుల్లో) మాట్లాడమంటే ఇంత సమస్య అంతసులభమా- అంతసూటిగావుందా?

కనుక ఇదిఆలోచించి తేల్చుకోవాల్సిందే' (ఆలోచించడానికికూడ మనసులో గతం- వర్తమానాలు, మాటలు- చేతలజ్ఞాపకాలు ఘర్షణపడకూడదు. ఘర్షణఅంటే పోరాటం- పోరాటం అభివృద్ధికి ఆటంకం.)

ఇంత నిత్యసత్యాన్నిచెప్పే అవతారంలేకనే (ఎవరితో ముగిసినట్లు అవతారాలు: బుద్ధునితోనా? ఇప్పుడునడుస్తున్నది కలికిఅవతారమా? అతడేనా ఈ 'అభ్యుదయ యాత్ర'ల పెల్లగుర్రం ఎక్కివచ్చింది) బానిససమాజాన్ని రద్దుచేయడానికి రోమన్‌సామ్రాజ్యంలో స్పార్టకస్ నాయకత్వంలో బానిసలు పోరాడారు ఇంగ్లండులో రాజరికాన్ని రద్దుచేయడానికి క్రామ్వెల్ రక్తపాతయుద్ధమే చేపట్టాడు. ఫ్రెంచ్‌విప్లవం అమెరికా స్వాతంత్ర్యయుద్ధం, ప్యారిస్‌కమ్యూన్, రష్యావిప్లవం, చైనావిప్లవం.

వియత్నాం, కంపూచియా. ఎవరికీ రాముని అవతారాలు అంటుబాటులో లేకపోవడంలో ఆశ్చర్యంలేదు. భారతదేశంలో చార్వాకులు మొదలుకొని, నాస్తికుడైన భగత్ సింగ్ వరకు ఈ సలహాని పాటించకపోవడంలోనూ ఆశ్చర్యంలేదు. 1857 ప్రథమ భారత స్వాతంత్ర్య సమరయోధులకూ ఈ సత్యం స్ఫురించలేదు. జాతీయోద్యమంలో పాల్గొన్న ప్రజలకూ తోచలేదు. అంత దూరపు సంగతులు మనకు ఎందుకు? తెలంగాణా విమోచనోద్యమానికి పూనుకున్న లక్షలాది ప్రజానీకానికి పోరాటం లేకుంటే 'అభివృద్ధి' ఈపాటికి ఎప్పుడో వచ్చివుండేదనే వివేకంలేదు. ఈ భూమి పుట్టి. ఈ భూమిమీద మనిషి పుట్టినప్పటినుంచీ ఆ మనిషికి ఈ పోరాటమే 'అభివృద్ధి'కి ఆటంకమవుతుందని తెలిసివుంటే మనిషి ఎంతమంచిగా ఆటవికుడుగా, జంతువుగా 'అభివృద్ధి' చెందివుండేవాడు! (సమస్యల్లా మనిషికి సమస్యను అర్థం చేసుకొనే మెదడున్నది. ఆ సమస్యను పరిష్కరించే సాధనాలున్నవి. అవి లాఠీలు, తూటాలు మాత్రంకావు.)

బ్రిటిష్‌వాళ్ళ కాలంలో రైళ్ళొచ్చినవి. రోడ్లువచ్చినవి. విద్యుచ్ఛక్తివచ్చింది. యునివర్సిటీ చదువులొచ్చినవి. ఇంగ్లీషు మందులొచ్చినవి. సినిమావచ్చింది. కొద్దో గొప్పో పరిశ్రమలు వచ్చినవి. మిల్లుబట్టలొచ్చినవి. ఇవన్నీపొంది "ప్రభుత్వం ప్రజలకేమీ చేయలేద"ని మాత్రమేకాదు అసలీప్రభుత్వం ఇండియావదిలి పోవాలన్నారు. రాడికల్సేకాదు. గాంధేయులు.

నైజాంరాజు నైజాంరైల్వే వేయించాడు. ఉస్మానియా ఆసుపత్రి, యూనివర్సిటీ కట్టించాడు. మంజీరానదికి ఆనకట్టలేయించి నిజాంసాగర్ పొందించాడు. ఆజాం జాహిమిల్లు, మోజాంజాహీమార్కెట్ ఒకటేమిటి- ఎన్నోఅభివృద్ధి కార్యక్రమాలు చేపట్టాడు. అయినా ప్రజలు మామూలుగాకాదు సాయుధంగా గద్దెదింపడానికి పూనుకున్నారు.

బ్రిటిష్‌వానిది సామ్రాజ్యవాద వలసవిధానమని అది తమ మూల్గులను పీల్చేస్తున్నదని, తమకు 'స్వాతంత్ర్యం' కావాలని పోరాడారు ప్రజలు

నైజాంది జమీందారీ జాగీర్దారీ భూస్వామ్య నిరంకుశపాలన అనీ నిజాం మాత్రమేకాదు, గ్రామాల్లో దొరలుకూడ వుండకూడదని 'దున్నేవానికీ భూమికావాల'ని పోరాడారు తెలంగాణా ప్రజలు.

వీళ్ళంతా కళ్ళముందరి 'అభివృద్ధి'ని కానలేని అంధులైన పోరాటమూర్ఖులు. ఇప్పటికీ పోరాటం మాననివాళ్ళు ఈ 'అభివృద్ధి' నిరోధకులు.

ఇది అర్ధసత్యం కాదు నగ్నసత్యం. ఉపశ్రుతి- కాదుఅపశ్రుతి : ఈమాత్రం 'అభ్యుదయ యాత్ర'కే ఐదారేళ్ళరాడికల్స్ 'విలేజ్ క్యాంపెయిన్' కారణమయితే, రాడికల్సేచెప్తున్నట్లు ప్రజలు సాయుధులైతే 'దున్నేవానికిభూమి' మాత్రమేకాదు, రాజ్యాధికారంకూడ వస్తుందేమో- అని ఎక్కువమంది 'అభివృద్ధి'వైపుకాక పోరాటంవైపు మరింతగా మళ్ళేట్లున్నారు. 12-2-84

పాట :

# ఊరు మీద ఊరు

ఎరాప్రి సూరయ్య

ఊరుమీద ఊరొచ్చెరో రాజన్న
ఊరుమీద పీడొచ్చెరో ॥ఊరు॥

జీబులల్ల వచ్చినోల్లు మూటాలను పేలుస్తె
కార్లల్ల వచ్చినోల్లు కష్టాలను దీర్తరట
అరిగోసలు బెట్టిబెట్టి పుసురుబోసుకునెటోల్లు
అరికాలుకు ముల్లుదిగుతె మునివంటితో దీస్తరట
ఇండ్లజాగ గావాలన్ని పత్రాలు పంపుకుంటె
పత్రాలమీదనే మంజూరి జేస్తరట
ఆరువేల కర్చుబెట్టి అనువైన ఇండ్లుగట్టి
అడిగినోల్లందరికీ ఎట్టిగనే ఇస్తరట
ఇన్నాల్లు లేని పేరిమరో రాజన్న
యీనాడే పుట్టుకొచ్చెరో రాజన్న ॥ఊరు॥

తాశీలు దఫ్తరోల్లు, పోలీసుమామగాల్లు
ఊరంతకలెదిరిగి రిపోర్టులే రాస్తరట
రిపోర్టులు పరీక్షించి కిందామీద బాగజూసి
నడుంగట్టి అధికార్లు సేవజెయ్యతయారట
అనాధులానందరినీ ఆదుకోనుటన్నారట
ప్రాణాలుదీసినోల్లు శివిగంటి పోస్తరట
ఇన్నిజేసెటోల్లంత ఇన్నాల్లు యాడుండిరి
ఇయ్యాల వచ్చినోని పత్తరేపు అయిపుండది
హామీలు ఇచ్చెటోల్లురో రాజన్న
హంతకులని మరువొద్దురో రాజన్న ॥ఊరు॥

అక్కెరబడ్డప్పుడల్ల అధికార్లను జూడాలన్నట
ఇదిగిదిగో మాపనిఅని చెవులుపట్టి జెప్పాలన్నట
ఏదైనసరే అడిగె హక్కులుమనకున్నయట

[illegible]

హక్కులు ఉన్నయని విన్నపం జేయాలన్నట
విన్నపం వినగానే టపటపటప బైఠగొట్టి
దస్కతుజేసేసి ఆర్డర్లు ఇస్తరట
హక్కులు మనపైతెరో రాజన్న
విన్నపాలు మరిఎందుకురో రాజన్న ॥ఊరు॥

ఇందర్నీ జంపినోల్లు ఇండ్లనిలాబెడ్తరట
సభలేపద్దనోడు పెట్టపశలు పెడ్తడట
మొగడుజచ్చినోల్లకు ముండధనం ఇస్తరట
కాలిబాట లేనూరికి అరుసార్ల బస్సంట
బస్సునిండ పోలీసులురో రాజన్న
బిలాదూర్ మనకేందిరో రాజన్న ॥ఊరు॥

కలెక్టారు డిఐజి పట్నాలు వదిలి కదిలి
పల్లెలన్ని ఇరుగదిరిగి
మల్లారెడ్డి పల్లెలోన మీటింగుబెట్టినారు
అడిగినయి ఇస్తమని లేనియి ఇడుగన్నారు
ఖిలాషాహపురంలో వేదాలుగొప్పయట
పైడిపల్లి మీటింగుల మావోడు జోహార్లట
పేపర్ల రాతలట రేడియోలకూతలట
ఏరోటిపాటఐు ఆ రోటికాడనట
పట్టిమాట నమ్మొద్దురో రాజన్న
పులులు జింకలెట్లాయెరో రాజన్న ॥ఊరు॥

మొన్నామొన్న పల్లెలోన చల్లానీ తల్లిఒడిన
నాల్గులారీలనిండ పోలీసులు దిగినారు
పురుగూలుపాకినట్లు ఊరంత సుట్టుముట్టి
చెట్లాకుకట్టేశి మందినంతకొట్టిసుర్రి
రాండోర్రిజులూరినిండ [illegible]

కథ :

# దొంగ గొడ్డుకు లొటారం

బి. ఎస్. రాములు

మర్రిసెట్టు నల్లగుట్ట కాళ్లకాన్నేఉన్నట్టు కనబడ్తదిగని మర్రికి నల్లగుట్టకు సగము మైలుదూరముంటది. మర్రినుంచి పల్లెకు కోసుదూరం.

మర్రిచెట్టు ఈ పక్కనుంచి యింకోపల్లెకుపోయే తొవ్వపోతుంటది.

గిదొక పల్లెపొలిమేర. నల్లగుట్టఆవల మల్లొకపల్లె ఆతగిత్నె. మల్లోగుట్ట త్తది. దూరంనుంచిసూత్తె అన్నిగుట్టలొకతీర్గనే కనపడ్తయిగని గుట్టలకునడుమ యెడమున్నది. గుట్టగుట్టకు నడుమ వొపల్లెవున్నది, గుట్టల అంచులపొంట పల్లెలకు తొవ్వున్నది.

కాన్నితొవ్వలన్ని మొన్నమొన్న కంకరోడ్లుజేసిన్రు. ఎటుజూసినా సన్నల్ల పిల్లతొవ్వలు కనపడ్తయి. అవి ఏడికోతయోతెల్వది. ఓటి తాడిసెట్టుకాడికోయి ఆగిపోతది. ఓటి ఒర్రెకాడికోయి ఆగుతది. ఓటి గుండుకాడికోయి ఆగుతది. ఓటోటి పక్కగపోతనేవుంటది.

ఒర్రెల పాయదీసిన బాయికాడ ముసలి యిప్పసెట్టు సీడకాడ నలుగురు కూసున్నరు.

---

రెడ్డిదొరలు పోలీస్‌దొరలు భుజం భుజంకలుపుకోని
పల్లెప్రజల గోసపెట్టి మీసాలుదువ్విన్రు
ఊరినిండ పోలీసులురో రాజన్న
ఊరిదొరల మించినారురో రాజన్న "ఊరు"

కాకిబట్టలోల్లంత ప్రజలసేవజేస్తరట
క్యాంపులుబెడితెగాని పల్లెబాగుపడదట
ఉన్నమంది చాలరని సీయార్పిని దించినారు
సేవసంగతేమొగాని సావుదప్పతేసాలు
ఉద్యమాన్ని అణిచేసే కొత్తఎత్తులెత్తినారు
ఎదురుదెబ్బ తీయకుంటె జీవితమే ఏటిపాలు

"మరి సైలెంసుమా! జాగ్త డాలె" అంటున్నడు బసీను సుంగిమీదున్న మనిషి.

'మనకోసం ఎదిరిసూత్తున్రిగావచ్చు పోదాంపాన్రి' అని అడుగు ముంగటి కేసిండు మొగిలి. 'మేంరాన్ది ఎల్లదా' 'మీతోటి వాల్లకట్టసుకాలుగుడ చెప్పుకుంట రట. మీరత్తనేలెక్క లేపోతెలేదు అన్నరు'. 'అయితేపద' అని అనుసరించిండ్రు ఆల్లు. "అదీకాక పగ్రిజలకోసం తిరిగెటోల్లకు పగ్రిజలనడుమకచ్చుటానికి బయమేందట అని అంటన్రు" అన్నడు శంకర్.

రెండు సైకిల్లమీద నలుగురు ఆ పిల్లతొవ్వపొంట పడిపోయిన్రు.

అప్పుడోటి అప్పుడోటి సుడిగాల్పు వేత్తంది. ఎండిపేయిన ఆకులన్ని మొగు లెత్తు లేత్తన్నయి.

## 2

ముసలి యాపసెట్టు. దానికి పదిగజాలదూరాన ఓ కానుగుసెట్టు. దాని ఎదు రుంగ ఓ గుడిసెహోటలు. ఆ హోటల్లనే ఒక ఆల్మారసొంటిదాంట్ల బీడీలు సిగిలేట్లు పాస్లున్నయి. గుడిసెముంగట అటోటి యిటోటి బెంచీలతీర్గ పాతిన కొయ్యలమీద చెక్కలున్నయి. బూరుగుడబ్బమీద నిన్నజేసిన బోంది, పకోడి, పొడిఅటుకులు మూతలల్ల పోసిపున్నై, పంక్చరైన సైకిల్లను మంచిగసేసే సామాను, పంపు గోడకుఒరిగిచ్చి ఉన్నది. హోటల్ గుడిసెపక్కకు ఏడెనిమిది సైకిల్లున్నై. అవి కిరాయికిచ్చేటివి కాదుగని ఎవరో ఆడపెట్టుకున్నట్టున్నరు

హోటల్ల ఎవలో సిగిరేటుకొరుకు తోటి బీడిముట్టిచ్చుకోని కొరుకువాపసిచ్చి 'ఆల్లురాకపాయిరి ఈల్లురాకపాయిరి! యియ్యాలైతదంటవ"అని ముచ్చటవెట్టిండు. ఆయనేదో అంటున్నడు. హోటల్ల ఆల్లు ఏడెనిమిదిమంది జమైన్రు. ఏదోటి మాట్లాడు తనే ఉన్నరు.

'ఎవలో అచ్చివట్టున్నరు' అన్నరు ఎవలో. "ఎట్లంటవు?"అన్నరు మల్లొకలు

'అదేంది లొల్లిబందయిందిగద'. అన్నడు ఒకాయెనె ఆ ఊసూసుకుంట. అందరు ఆ ఊసూత్తున్నరు.

ముసలి యాపసెట్టుకాడ ఇనూర్రు మందిదాక జమైన్రి. వారంరోజులనుంచి వాల్లు కూలీలు పెరుగాల్నని సమ్మెజేత్తున్నరు.

ఆవూరి మోతుబరులు ఒకడుగు దిగచ్చిన్రి.

ఏడికో ఒకాడికి మాట్లాడుకుందామని పిలుపనంపిన్రి. గందుకే అందరు జమైన్రు ఆడ.

అన్ల పిలగాన్లు, పెద్దోల్లు, ముసలోల్లు మొగోల్లు ఆడోల్లు అందరున్నరు.

సీంపట్టురంగు దొడ్డుసీరెగట్టుకొని జానెడెలుపు గోసిచెక్కి సికముడిసి కొంగు నడుముకుసెక్కి ఓసెయ్యి నడుంకుఆనిచ్చి ఓసెయ్యి నొసటికాడ నీడపట్టి "ఎహె అందరు కూసోన్రి" అని అందరు సూత్తున్నకేయి మునిగాల్లమీద నిక్కినిక్కి సూత్తంది ఒకామె.

పెయి మీద అంగి లేదు. తెల్లగ బుర్రమీసాలు పెంచిండు. నెత్తంత తెల్ల పడ్డది. పెయిమీద చిన్నది తెల్ల పంచేసుకున్నడు. దొడ్డు దోతి మోకాల్లమీదికి బిగిచ్చి కట్టిండు. పెద్దమనిసి తీర్గున్నడు. ఆయెనె కూసుండుమని అందరికేయి చేతులూపుకుంట. 'ఎహెసనరాదున్ని కూసుంటె అందరికి కనవడ్తది.' అని కూసో పెట్టిండు.

'అగో మొగిలన్న, శంకరన్న అత్తన్రి' అన్నడు కుసున్నోడు లేసి సంబర్లింగ ఓ నెక్కరు పిలగాడు. ఒంటి జడేసుకున్న బిక్క పొల్ల కూసున్న జాగలకెల్లి చెంగుమని లేసి సూసింది.

అట్ల ఒకలెనుకొకలు మల్ల అందరు లేసిన్రి.

"అల్ల దగ్గరికి ఎవలన్న సైకిలేసుకొని పోతె, జెల్ది పని ఒడిసిపోవు" అన్నరెవరో. సెట్టుకిందున్నోలకెల్లి వోటల్లున్నోల్లకెల్లి సెయి వూపి "ఎవలన్న వోయి రాపోన్ని" అన్నడు ఎవలో.

'నెందుకు అల్లు రారా!' అన్నడు ఇదివరదాక బీడతాగిన మనిసి.

'ఇదుపరదాకుండీ పాయిరిగదర! మనం బోయి సెప్పచ్చుడు సిన్నతనమా? గట్లంటె సిన్నతనంనుంచి ఆల్లకు ఎన్నిచేసిపెట్టిమి? పనిగావాలెముందుగాల. పోయి రాపోన్రి' అన్నరెవరో మల్లగుంపులకెల్లి

ఎవలో వోటల్ పక్కకున్న ఓ సైకిల్ దీసుకొని బయిలెల్లిండు. 'నేనుగూడ అత్తపా' అని తయారైన్రి యింకోయిద్దరు.

యాపసెట్టుకిందున్నగుండు రాయి మీద కూసున్నరు. మొగిలి శంకరిలతోటి అచ్చిన యిద్దరన్నలు.

అందరు కూకున్నరు. కొంచెం అడుసకని అయిదారుగురు పడుసోల్లు నిలబడే వున్నరు. యింకో నలుగురైదుగురు తొవ్వకొంటి ఎవలత్తున్నరి సూత్తున్నరు.

'కొంచెం ఆలిసెమైంది' తప్పైందన్నట్టు చెప్పిండు మొదటన్న.

ఏమో సెప్తున్నడని అందురు లొల్లి బందు జేసిన్రి.

గాలికి యాపకొమ్మలు, కానుగు కొమ్మలు ఊగుతన్నసప్పుడినవత్తంది. ఎవలో దగ్గుతున్న సప్పుడు ఎవలో నెత్తి బర్రిబర్రి గోర్లతోటి గీకుతున్న సంప్పుడినవత్తంది.

సైకిల్లమీద వూర్లెకోయినోల్లు ఆడికి సేరచ్చిన్రి.

'యెనక అత్తున్రి' అన్నరు అల్లు

హోటల్ల యింకా ముగ్గురు నలుగురు ఏదో మాట్లాడ్తనే వున్నరు. కొంచెం సిన్నగ.

ఇదువరాక బిగిరెయి తాగినామెనె అక్కన్నే వున్నడుగని ఆ ముచ్చట మనసున పెడ్తలేదు అటుయిటు అన్ని దిక్కుల ఎందుకో అనుమానంగా తేరిపార జూత్తండు. అవెన్క గుండు రాయిమీద కూసున్న అన్నలకెయి సూత్తండు.

ఏందో యాదికచ్చినట్టయి ఒక్కడుగు ముంగటికేసిండు. మల్ల ఎందుకు తియ్యి అనుకొని ఆగిపోయిండు.

ఇట్ల రెండు మూడు సార్లు తత్తరపడ్డడు, మల్ల వూర్లెకెయి వస్తున్న తొవ్వకేయి తేరిపార జూసిండు.

అల్లు వస్తున్నరు హోటల్ల కెయి మొకం పెట్టిండు. అల్లు హోటల్ దాటంగనే మల్లవాల్లను తేరిపార జూసిండు.

ఏదో నిచ్చయానికి వచ్చినోనితీర్గ హోటల్లకెల్లి నడిసి యేపసెట్టు వెనుక సేరిండు అన్నలను దగ్గరికెల్లి సూసిండు. ఏదో పిలువపోయిండు. సప్పుడు జేక ఊకున్నడు.

'మీరు ఎట్లజెప్తె అట్ల యింటం. న్యాయంగ జెప్పున్రి మీరడిగినంత కూలి యిచ్చి మీరడిగినంత జీతమిచ్చి పని జేపిచ్చుకుంటె యింత పెట్టుబడి పెడ్తంటెగూడ ఏమన్న వత్తందా? అసలోనికి పెట్టిన పెట్టుబడిఎల్తలేదు. మీతోటి అసలోడు చిన్నదో పెద్దదో పని జేత్తలేడా మరి! ఆ కైకిలి మందమన్న గిట్టువాటు కావద్దా! ఈ వూల్లే దొరలెవలులేరు. దోసుకొని తినెటోల్లు లేరు. అందరు రైతులే కొంచెం పెద్దరైతు కొంచెం చిన్నరైతు. గంతేగద! గివ్వన్ని విచారించుకొని చెప్పున్రి న్యాయం. మీరు యిపన్నన్ని విచారించుకొని గూడ యివ్వున్రి అంటే ఎంతంటె అంత యిస్తం' అని యింకా ఏదో సెప్తనేవున్నడతను.

ఇంకొకల్లు అందుకున్నరు 'చెప్పుకుంటె పెద్దరుకం గాదు గని నేను గూడ కమినిస్టుల పనిజేసినోన్నే. నైజాం జమానల నేన్ దొరలకు వ్యతిరేకంగా కొట్లాడి నోన్నే ' అని ఇంకేదో సెప్పవోతన్నడు.

ఎవలో గుంపులకెల్లి 'గపుడు ఏంలేనోనివి గిపుడు యిరువై యెకురాలు తరి పదెకురాల తోట మూడు కరెంటు బావులెట్లనై. నాకంటె ఎయిక్వకట్టపడ్డావా? ఉన్నొక్కెకురం నీకే 'అమ్ముకుంటిగాదుర' అని ఎక్కిరించిను౦.

'కమినిట్టుదొర' మల్లెవరో ఎక్కిరించిను౦.

మాట్లాడతన్న కమినిస్టు దొర నోరు మూతపడ్డది.

'మేం కోరిసయన్ని వాజీబుగనే వున్నయి' అన్నడు మొదటన్న.

యేపసెట్టు యెనుకకు అచ్చినాయెనకు ముండ్ల మీద నిలవడ్డ ట్టైతాంది. యిగ ఆగలేక వోయిండు.

'అన్నా ఒక్క నిమిషం' అని కొంచెం మెల్లగ పక్కకు పిలిసిండు. గుండు మీదికెల్లి లేసి రెండడుగులు సెట్టెనుక కెయినడిసిను౦.

సప్పుడు జేకుంటున్నోల్లు ఏందొ మెల్లమెల్లగ గుసగుసలు వెడుతను౦.

'అన్నా! గింత మందిల సాటుకు పిలిసిన్నని తప్పువట్టుకోకు ఎట్లజెప్పాన్నో తెల్వక గింత సేపు ఆగిన. వాల్లు పోలీసుల్ని తోల్కరమ్మని ఇద్దర్ని సైకిల్లమీద తోలిచ్చిను౦. అల్లచ్చెదాక మీతోటి గిట్నే ఏదోటి యాల్ల గడువని అన్నట్టు మాట్లాడు కుంటజేర్తరు. మీరిక్కడుంటె ప్రమాదం యిటె ఎనుకకెల్లి ఎల్లిపోని౦' చెప్పతుంటెనే ముచ్చెముటలువోసినయి. అన్నల కేమన్న అపాయం జరగజిక్క అన్న భయంతోటి మా టావసుకుతాంది.

అన్నలు యేపసెట్టు ఎనుక నుంచి సంచులు ఓసుకోవి ఆపుతలకోతున్నట్టు మెల్లగ నడిసిను౦.

యాబై గజాల దూరంల బండ్లబాటున్నది. అయితె వానకాలంల ఒర్రె తీర్గ పిల్లవారి ఆ బాటోబాగ పంతైంది ఒడ్లు ఎత్తుమీదున్నయి.

ఒడ్లపొంట వాయిలి చెట్ల యెవుటెవుటు వాసన యిసిరికొడ్తాంది. నిలువెత్తు యెగిన వాయిలిచెట్ల అవుతల ఏంగనిపియ్యది. ఆ వాయిలి చెట్ల నడుమ ఏర్పడకుంట పెరిల్లిపోవచ్చు ననుకున్నరు అన్నలు.

ఎందుకైనా మంచిదని వాయిలిచెట్లు దాటి బాటలచేరే ముందు వాయిలి చెట్ల దగ్గర దాకవోయి వోసారి తొవ్వవొంట అటీటు జాగర్త కోసం సూసిన్రు. చెయి సంచిలకు పెయిబోయింది. జాగర్తగున్నరు.

పగ్గంపెట్టు దూరంల పోలీసు వ్యాను బండ్లబాట మీద వాయిలిచెట్లసాటుకు యింజన్ ఆపుజేసుకొని ఉన్నది. ఎప్పుడచ్చిందో ఏమో.

ఒక్కడుగు ముంగటికేయబోయి పామును జూసినట్టు అట్లనే బీరిపోయి మెల్లగ యెనుక మర్రి ఎడంపక్కకు పెరండ్లల్ల నడుసుడు మొదలువెట్టిన్రు.

వాల్లెందుకు లేసిపోయిన్రు ఎటువోతున్నరు అని అక్కడ మీటింగులున్నల్ల కెవలకు సమజుగాలేదు అందరు అటే సూత్తాన్రు.

రెండుమూడు పెరండ్లు దాటితే బండ్లబాట తూర్పు దిక్కుకు మలుగుతది. పోలీసు వ్యానుకు కన్పియ్యకుంట అదే బాటెంబడియెల్లిపోవచ్చు. తొవ్వ గుట్టబోరు పక్కకెల్లి పోతుంటది. గుట్టెక్కి అవుతలి పక్కకు దిగె కాలి బాట గుడ ఉంటున్నది. అట్లపడిపోవచ్చునని ఎంతో జాగర్తగ జెలిజెలి నడుస్తున్నరు.

పోలీసు వ్యాను స్టార్టుజేసిన సప్పుడైంది. అయితె అది వీల్లువోతున్నకెయి తిరుగాలంటె కేకపెట్టు దూరం అట్లనే ముంగటికోయి ఆడ మలుపుకొని మల్ల యెనుకకు రావలె.

అయితె పోలీసులు దిగి రైఫిల్లు పొజెషన్ల పట్టుకొని నడుస్తున్నరు వాయిలి చెట్లు సాటునుంచి.

బండ్ల బాట మలుపచ్చింది, బండ్లబాటపొంట పోవాల్నంటె గుట్టసుట్టు దిరుగాలె.

ఆ మలుపు మలుగక సక్కగవోతే పిల్లబాటవొంటి గుట్ట జెల్లి దిగచ్చు.

బండ్ల బాట లాభం లేదనుకున్నట్టున్నారు. పిల్ల తొవ్వ తొక్కి ఒకటేవురుకుడు.

“ఠైరో మూక్కెలవుడె! షూట్ కర్ దేంగే! ఠైరో” బూట్ల సప్పుడు.

అంతట్లనే మలుపుకచ్చిన పోలీసువ్యాను ఆడికి సేరచ్చింది. భయానికో భక్తికో అన్నెక్కిన్లు. వ్యానటు, వాల్లిటు, ఉరికేది ఉరుకుడు.

వ్యానువోయింది గదాని వాపసు వోదాం అనుకుని ఎనుకకు మర్రిసూసిన్రు. ఒక యిద్దరు ఆల్ల వెనుకనే వురికత్తున్రు పోలీసులు.

అటురికి గుట్టబోరు దిగితె మల్ల పోలీసు వ్యానుంటది. ఇటు పోలీసులు.

యెనుకత్తున్న పోలీసు రైఫిల్ పేల్చినట్టున్నడు. ఉరుక్కుంట. అయితే బొడిగెరాల్లల్ల బూట్లతోటి ఉరుక్కుంట కాల్నె సరికి అది కొంచెంముంగట భూమిల దిగింది.

చిన్నచిన్న పొరుకలు, కాల్లకు గీరుకపోతున్నయి. కాల్ల చెప్పులేడజారిపోయినయో. కట్టుకున్న లుంగీ ఊసిపోతంది, బిగిచ్చి కట్టుకునే సమయంలేదు. ప్రాణాలు యిగపోయినట్టే అనుకున్నరు. అయినా ఉరుకేది ఆపలేదు. ఉరికురికి గుట్టబోరు ఎక్కిను౨. ఇగ గుట్టబోరు దిగుడే తరువాయి. గుట్టబోరు దిగుతే పోలీసులు ఆ గుట్టబోరు ఎక్కిఎక్కడున్నాగుడ కాల్చిపారెయచ్చు.

ఒక్క క్షణం ఏంజేయ్యాన్నో తోసలేదు. గుట్టబోరు దిగే ముందు ఒక్క క్షణం అట్లనే ఆగి దమ్ముతోటి ఎగవోసుకుంట కండ్లల్ల పేరిన నెత్తురుతోటి ఒక్కసారి ఎనుకకు దిరిగిను౨. వంగి సెయిసంచిలకెల్లి దీపినట్టే భూమ్మిదికెల్లి చెరో గుండ్రటి రాయిదీపి పోలీసోల్లకెయి అందినంత దూరం యిసిరిను౨.

అన్న ఆగంగనే పోలీసోల్లు దెబ్బకు ఆగిపోయిను౨, రాల్లువట్టగనె పదడుగులు యెనుకకురికిను౨.

ఆ గిదే సమయం అనుకొని అన్నలు గుట్టదిగి ఉరికిను౨. ఒక రెన్నిమిశాలు ఆగి పోలీసులు గుడ ఎనుకురికిను౨.

ఒకన్న రాల్ల దట్టిబోర్ల బడ్డడు. మోకాల్లుపలిగినై. ముక్కు, గదువ పలిగి నెత్తురుగారుతున్నయి ఎక్కడో తలుగకూడనికాడ దెబ్బదాకినట్టుఅయింది. మూర్చచ్చినట్టుఅయింది. లేవ సాతనైతలేదు. ఇక అయిపోయింది అనుకున్నడు. 'కా(మేడ్ పరుగెత్తు' అని లావట్టి చెయిపట్టి గుంజుక పోయిండు ఇంకో అన్న

సచ్చుడు ఖాయం అని తెల్సినా అట్ల ఉరుకుతనే ఉన్నరు.

పొద్దంగుతున్నది. పోలీసు వ్యాను సప్పుడుసావుకేక తీర్గ యినవడ్తున్నది.

కాల్లు సీర్కుపోయి మంట మండుతున్నయి. పిక్కల నుంచి మొదలుపెట్టి అరిపాదందాక నెత్తురు కారి కారి నల్లవడి అట్టగట్టినయి. నోరెండుకపోతంది. లుంగీ లెక్కడ వూసిపోయినయో ఎవలకు తెల్వది. జాంగబనీను మీదున్నరు. ఓ గుండు సాటుకు దమ్ముతీసుకుంటున్నరు. ఎక్కడ లేని ఎగబోత అత్తంది.

తుమ్ములు అచ్చేటట్టున్నయి. తుమ్ముతే శతు౨వుకు ఆసూకి తెలువ్తది. ప్రాణంపోతది తుమ్ము రాకుంట ముక్కు నలుసుకుంట బిగవడ్తుంటె యిట్లపానంబోతున్నది.

ఆల్లదమ్ము ఎగపోత అల్లకే భయమయ్యేటట్టు యినవడుతంది. ఇగ ఆ గుండు సాటుకున్న జాడదొరికెనా ఖతమె. తెల్లారి ఎన్‌కౌంటర్లో యిద్దరిమృతి అని పేపర్ల వచ్చుడు ఖాయం అనుకున్నరు.

'కామ్రేడ్ నీకు దండంబెడ్త నేను నడ్వలేను. నువ్వొక్కనివన్న ప్రాణాలు గాపాడుకోపో' అన్నడు ఒక అన్న.

'కామ్రేడ్ ఇలా ఈ గుండు సాటుకు చచ్చేబదులు పరిగెత్తుతూ చచ్చిపోదాం కామ్రేడ్, ఏమైనాగాని యింకో గంట పరిగెత్తాల్సిందే. గుండ్లకు బలైనాసరే. ఈ గుండు సాటుకుంటే మాత్రం తప్పక ఛస్తాం. పరిగెత్తితే బతికే అవకాశం వుంటది. పద కామ్రేడ్,' ఇంకో అన్న.

వ్యాన్ గుట్టకింద అటీటు చక్కర్లు కొడుతున్నది. వెనుకున్న పోలీసోల్లు యెతుకుతనే వున్నరు.

గుండు సాటునుంచి అట్లఅట్ల దిగి బండ్లబాటదాటి పొలాలల్లపడ్డరు. మల్ల వురుకుడే. చెట్లేం అడ్డంలేవు. పది నిమిషాలల్ల వ్యాన్ చూసి వాళ్ల యెంటపడ్డది.

అయితే పొలాల గట్లున్నయి. అట్ల వ్యాన్ పోరాదు. అంతట్లనే యింకో పోలీసు జీపచ్చింది.

వ్యాను రోడెంబడిపోతుంటే జీపు పొలాలపొంట వాళ్లమీంచి వోతున్నది.

ఎత్తెత్తు వొడ్లకాడ డిగపడ్డప్పుడల్ల పోలీసులు దిగి జీపును అమాంతంలావట్టి మల్ల ఉరుకుడు

అన్నలు ఉరికి ఉరికి ఒకనిమిషం ఆగిన్రు. ఆలోచించిన్రు ఒకవ్యానుబోయి రెండువ్యాన్లయినై. ఉరికి బతుకుడుకల్ల. అందున అన్నిపొలాలే చెట్లులేవు సాటు లేదు. ఎవలో యిద్దరు సైకిల్లమీద వోతున్నరట్ల.

'అన్నా! దండంబెడ్తం మమ్ముల గీవూల్లేపడగొట్టిపోన్రి' అన్నడొకఅన్న.

రేగిననెత్తి బనీను జాంగ, ఎగపోత, తుమ్మలు, పెయంత చీర్కపోయి కారిన నెత్తురుజూసి ఏమనుకున్నరోఏమో.

'మీకుకావాలంటె ఓ సైకిలిత్తం మేం డబల్‌పోతం. మీరు ఫలానకాడ పెట్టున్రి. రేపుతీస్కపోతం సైకిలు' అన్నరు.

కొరిజీవనాన్ని లెక్కపెట్టక చిన్నన్నను ముంగట కూసోవెట్టుకొని పెద్దన్న నెత్తురుగారుతున్న పాదాలతోటి జాంగతోటి ఏదోపల్లెజేరిండు. అక్కడగూడ ఏదో

జీపు ఎదురుంగ వత్తున్నసప్పుడైంది. వెంటనేదిగి దగ్గరున్న ఓ కొట్టంల సైకిల్ పెట్టి ఏదో కనపడ్డయింట్ల దాచ్చిన్రి. కొన్ని మంచినీల్లడిగిన్రి.

దుమ్ములేత్తంది. గొడ్డుగోదలు పల్లెకుచేరత్తన్నయి. తొవ్వలనిండ అవ్వే అయినయి. పెద్దన్న "అమ్మా మేం రైతుకూలి కార్యకర్తలం. ఎవలన్న మాకోసం వస్తె లేరనిచెప్పున్రి మేం! గీ గడ్డికుప్పల కొంచెంసేపు దాగుతం" అన్నడు. ఆయాసంగా

విన్నదానికన్న సూసిందానితోటి ఎక్కువ భయమైంది వాల్లకు. పెద్దరువాజ గొల్లెం బెట్టిన్రి లోపల్నుంచి,

తుమ్ములు మొదలైనై. తుమ్ముమీద తుమ్ము. తుమ్ములే ప్రాణంతీసెటట్టున్న యనుకున్నరు. బలవంతంగ ముక్కునలుసుకున్నరు.

పూర్లెకు వ్యానువచ్చి తిరుగుతున్న సప్పుడైంది. తొవ్వకడ్డంమున్న గొడ్డు గోదలను 'పంపం' అనుకుంట అదిలిస్తున్న అలికిడైతంది.

తాగినసీల్లకు వాల్లకు సెమటలు గారుతున్నాయి, ఉప్పుసెమటదాకి తాకిన దెబ్బలు మంటమండుతున్నయి. కడుపుల ఆపర లేకుంటున్నది.

ఏం సాతనైతలేదు, అండ్ల వాతె తుమ్ములు.

చిన్నన్న గడ్డిల పీసుగతీర్గ పడిపోయిండు. ఇంటోల్లు ఎవలూ ఆ గడ్డికుప్ప కేయి రాలేదు. పావుగంట గడిసింది.

ఎక్కువసేపు అక్కడుంటె ప్రమాదం ఆయింట్లనుగుడ పోలీసులు రావచ్చు.

'అక్కా పోతం' అన్నరు వాల్లు.

'ఒక్కనిముషం ఆగున్రి' అని యింట్లకోయింది అక్క. రెండు పాతదోతులు తెచ్చి 'యివిగట్టుకోన్రి' అన్నది.

ఆ పాములంకు అన్నలకండ్లల్ల నీల్లు సుడితిరిగినై. గుండెల దుక్కమో ఏంటిదో నోట్లెకెల్లి మాటరాలేదు.

ఆ దోతులుపడ్తపెట్టి లుంగితీర్గ సుట్టుకున్నరు. పెద్దరువాజలకెల్లి సందిల పడ్డరు. అల్ల పరారిగోడపొంట పడుసుకుంట సందిలపడి మాదిగగూడెం కేయి చేరిన్రి.

అట్ల బండ్లబాటతోటిపస్తె మాదిగగూడెమే ముందు అంటుతది. పోలీసోల్లు అట్లనే అచ్చి గూడెంల ఇండ్లన్నిసొలికిన్రి గూడెంనుంచి ఊల్లెకు బయిలెల్లిన్రి.

ఈల్లిట్ల ఎనుకకెల్లి గూడెంలపడ్డరు. పెరుకున్నగుడిసెల సొచ్చినుౢ.

సాయిలు యింట్లనేవున్నడు. 'పోలీసులు గట్లఎల్లిపోవుడు అన్నలు గిట్లవచ్చుడు, కొంచెంముందుగిట్ల అన్నలత్తె ఎంతపరెషానై పోవు అని బయపడ్డడు'

ఎప్పుడు ఎంతగివాలైనా ఎన్నిరోజులుపాసంలున్నా మిలమిలమెరిసే ఆల్లకండ్లు బీరిపోయి లోతుకోయి అల్సిపోయినై.

సాయిలు వాల్లను ఎక్కువసేపు విసిగియ్యలేదు. లోపల్నే పండుకొమ్మనిచెప్పి అవుతలగొల్లెంపెట్టి తాలమేసి పోలీసోల్లముచ్చట్లు మాట్లాడుతున్న వాల్లగూడెవోల్ల తోటిగల్సి మాట్లాడ్తనేవున్నడు. ఎవలో పోలీసోల్లను సాపిత్తనేవున్నరు.

అక్కడ వూల్లెకువోయిన పోలీసులు యిల్లిల్లు ఎతుకుతున్నరు.

ఆ పెద్దరువాజకాడ కింద సిమెంటుజేసున్నది. రెండు తంతెలున్నయి. అవ్వీటి మీద పాదాల నెత్తురుమరకలున్నై. అదిజూసి పోలీసులు ఓ క్షణం ఆన్నేపరీక్షవట్టి సూసి ఆగిపోయినుౢ.

తలుపుసూకినుౢ. లోపల గొల్లెంబెట్టున్నట్టుంది. తలుపుదియ్యెడ్రింని గొల్లెం కొట్టుకుంట లొల్లిపెట్టినుౢ.

అక్కవచ్చి తలుపుదీసింది.

పోలీసుఅమీన్ ఆయాసంతోటి ఎగపోత్తున్నడు.

ఒకసారి పోలీసుకెయిజూసి తలదించుకున్నది. కింద సిమెంటుతంతెలమీద నెత్తురుమరకలు గనపడుతున్నై. ఒకక్షణం గుండె దడదడకొట్టుకున్నది. అంతట్లనే మల్ల గుండె ఓటవుజేసుకున్నది.

'యిక్కడికెవలన్న వచ్చినారౢ' కూౢరంగసూసుకుంట యిగదొరికినట్టే వసు కొని దైర్యంగ అడిగిండు.

'వచ్చినుౢ' న్యాలకేసిన మొకంఎత్తి పోలీసుకెయి దైర్యంగ జూసిందిఅక్క.

'ఏరి' అని లోపలికి అడుగెయ్యవోయిండు.

'ఇక్కడికస్తె యెల్లగొట్టిన ఈడవుండద్దని. వెంటనేఎల్లిపోయినుౢ' కండ్లల్ల కండ్లుపెట్టి దైర్యంగచెప్పింది అమీనుతోటి.

ఏంజేయ్యాల్నో తొయ్యలేదు పోలీసులకు. సిక్కినట్టేసిక్కి మాయమైనుౢ అనుకున్నరు.

ఎవల్నో తిట్టినట్లుతిట్టుకుంట లోపలఅటీటు ఓసారిజూపిన్రు. ఇల్లంత ఎతికిన్రు పోలీసులయెంటున్న సుంకరోడు "ఇది మన పోలీస్‌పటేలు తమ్మునిఇల్లుదొర! ఆల్లు గీడెందుకుంటరు జాంచేన్" అని తాపకోసారి అంటనేవున్నడు. వూర్లె యాల్లకు పోలీసుపటేలులేడు. తమ్ముడు లేడు. యింట్ల మొగోల్లెవలులేరు "సువ్వుండగ పోలీసోల్లుగిట్ల యింట్లఎట్లజొచ్చిన్రురా" అని అచ్చినంక అడుగుతరని వానిభయం వానికున్నది.

## 3

మూడువారాలైంది. మల్లదేయాపసెట్టు కింద మల్ల ఆల్లందరు జమైన్రు.

మూడు వారాలకింద ఆ యాపసెట్టుకింద జమైనోల్లందర్నికొట్టి దొరికినోల్లను పట్టుకపోయి నాల్రోజులు లాకప్పులేసికొట్టిన్రు. ఏదోకేసుపెట్టి జమానతుమీద యిడిసి పెట్టిన్రు.

మోతుబరి రైతులు ముక్యంగ కమూనిస్టుదొర వాల్లయిడుదలకోసం నాల్గయిదు సార్లు అమీన్‌ను గల్సిండు వాల్లకు లాకప్పుల సిల్లరకు పైసలిచ్చిండు. తనకేర్పాటున్న వకీల్నుపెట్టి జమానతు మీద ఆల్లనిడిపిచ్చిండు.

ఇవుతలకచ్చినంక వాల్లదగ్గర కర్చులకింద మనిషికి నూరు పట్టిచ్చిండు. వకీలు ఫీసు వేరే మాట్లాడుకోవాల్నన్నడు.

పోలీసులెట్లచ్చిన్రో ఎందుకచ్చిన్రో అన్నలంగతి ఏమైందో ఆల్లకు తెలువలేదు, కొందరికి యిదంత మోతుబరులే ముందుగాల ప్లానేసుకొని చెయించిన్రేమోనని అను మానంఅచ్చింది. కని ఆల్లేజమానతుండి ఈల్లను యిడిపిచ్చిరి. పైసలుయిచ్చి అర్సు కునిరి. గందుకే ఏమనరాకుంటున్నది. ఎవలమనుసుల వాల్లకు వుడుకుతున్నది.

కూలీల పెంపుదల పోరాటంమాత్రం ఆగిపోలేదు. ఇంక అది సెటుతెగలేదు. పనులు ఈలొల్లిల అట్లనే ఆగిపోయినై.

మల్లోసారికూసుండి మాట్లాడుకుందామని వీల్లువాల్లు అనుకున్నరు. సరేనన్నరు అందరు.

అయితే మోతుబరులే యిదంత ఎవలకు తెల్వకుండ జేసిన్రని ప్లానేసి ఆల్లను రప్పించేటట్టుజేసి అన్నలను పోలీసులకుపట్టిద్దామని ప్లానేసిన్రని, అయితే ఎట్లనో కొరి జీవునాలతోటి అన్నలు బతికిన్రని సంగపోల్లకు తెలిసింది.

అయితే మోతుబరులు యింకా మనసెవలు అనుమానిస్తలేరని నిర్ణయించిగ వున్నరు, అందుకే మల్ల మీటింగం పేమంటడని వొప్పుకున్నరు.

'మొన్న పోలీసుల పిలిపిచ్చినోల్లెవలో ముందుగాలతేలాలె' ఎవలో గట్టిగన్నరు.

మోతుబరులకు భయంబుట్టింది. ఏదో ఓటిజెప్పి ఆన్నుంచి జెల్దిపీకాలె అను కున్నరు. కాని పోయెటట్టులేదు. ఏంజెయ్యాన్నో సమజైతలేదు.

ఎవలోలేపి రెంశడుగు లెయ్యవోయిన్రు 'ఎవరా్రి అదు' గుంపులకెల్లి మల్లెవలో లొల్లివెట్టిన్రు.

'మా యియ్యపుడచ్చిండు. కొంచెం అర్సుకోవాలెగద!' అని ఏందో చెప్ప బోయిండు.

'అచ్చిన యియ్యపుడు ఎటువోడు. పొద్దుగూకి కోన్నిగాదు గొర్రెనెగోసి పెట్టు' సుట్టతాగుతంటే నోట్లెవూరిననీల్లు తుపుక్కున ఉంచిన్రు ఎవలో.

అంతెట్లనోవున్నదని మోతుబరులు ఎవలమనసుల ఆల్లు బయపడ్తాన్రు కని ఏమ్మాట్లాడ్తలేరు. ఏంమాట్లాడ్తె ఏమంటలోనని ముడుసుక కూసున్నరు.

'వూల్లెదూల్లె తప్పజేసుకుందామన్నది మీరే. అన్నలెట్లజెప్తె అట్ల యింటం అన్నది మీరే, అన్నలెందుకు మేంలేమా మాట్లాడుటానికి అంటె మా కట్టసుకాలు గుడ సెప్పుకొంటం అంటిరి. ప్రిజల మనిషి ప్రిజల నడిమికి వచ్చుటానికి బయ మేంది. అంటిరి, ఏదన్నైతె జిమ్మెదారు మేమేఅంటిరి. అంతఅని అంతజేత్తిరి. గిపుడా అన్నలెక్కడున్నరో ఎవలు పట్టుకపోయినోర్రి కావాలెమాకు.'

"మల్ల మామీద కేసులువెట్టిన్రి. ఎవలనేమన్నమని? ఏమాట కామాటనే సెప్పుకోవాలే జమానతుమీద యిడిపిచ్చిందిమీరే. గదిమాతర్రం నిజంకని నూరైతె ఒడిసెగద. నూరూర్రిపాలంటె ఎవలకన్న యింట్లపుట్టినయా పైసకు. అరువకటాలు వడి యిడిపిచ్చుకుంటిమి". పోలీసోల్లను పిలిపిచ్చిందెవలోగని ఆల్లకు నేనుజెప్పేది ఒకటేమాట. ఆల్లు ఎల్లకాలంమీకు కావలిగాత్తరా? మీ పొలాలు దున్నుతరా? నాట్లేత్తరా? ఎల్లకాలం ఒక్కూర్లుండేది మనం. గది ఆలోసించుకోవాల, ఊల్లెకెల్లి దెంకపోతం అనెటోల్లకు ఎవలేంజెప్పేది లేదుగని". శంకరి కొంచెంగట్టిగనే అన్నడు.

సీమసిటుక్కుమన్న యినవడెటట్టున్నది. ఎవలో ససురాదుర అని గుసగుస పాలుజీకె పిల్లగాన్ని సముదాయిస్తున్నరు. ఎవలో అగ్గిపుల్లగీకిన సప్పుడైంది.

శంకరి అందరికేయి కలెజూపిండు.

మోతుబరులు తలఎత్తుతలేదు,

కమినిస్టుదొరలేసిండు. ఓసారి సభను సుట్టుసూసిండు. "సరె జరిగిందేదో జరిగిపోయింది. అనుకుంటె వత్తదా? పోలీసులకెవలన్న జెప్పినారి: లేకపోతే పోలీసులే వాల్లిచ్చనాల్లే అచ్చినారి అన్నది యియ్యాలగాకపోతే రేపు తెలువకమానది. గపుడు ఏంజేత్తామన్నది అనుకుందాంగని అంతదనుక జరిగేదైతె జరుగుతనే వుంటాలెగద."

"అంటె ఏందెరాజన్నా! మేం పోలీసులతోటి దెబ్బలకు సత్తెసత్తిమి. అన్నలు సత్తెసచ్చిరిగని మీ పొలాలు ఎండది, మీపనులాగది ఏడికోడికాడికి కూలీలు, జీతాలు పెంచుకునేముచ్చట మాట్లాడుదాం ముందుగాల అంటవు".

మొగిలికి కోపంఆగుతలేదు. ఏంజేత్తెమంచిగుండు వీన్ని అనిమసుసుల అనుకుంటండుగని గింతమందిల ఏమనలేక కోపంబిగవట్టి వూకున్నడు.

అందరు పోలీసుల పిలిపించినోన్ని తన్నాలె గుద్దాలె కాల్లిరుగకొట్టాలె. వూల్లె కెల్లి ఎల్లగొట్టాలె అని ఎక్కడోడక్కడ గట్టిగనే అనవట్టిన్రి. మీటింగంత లొల్లి లొల్లైతంది.

"హెహె ఆగున్రి" గట్టిగఒర్రిన్రి ఎవలో, లొల్లి మద్ది గుసగుసలు మొదలైనై.

సొట్టదౌడలు బొక్కనోరు, ఎండిపోయిన తోడుకలతీరుగున్న మైసడు లేసి బొక్కలతేర్గున్న కర్రిసేతులూపుకుంట లేసినిలవడ్డడు.

"గడిగిప్పుడ్ల తేలదిగని తెల్సినంక దొంగగొడ్డుకు లొటారం గట్టినట్టు ఎనుక పెట్టాలె. గట్లయితె యింకోల్లకు బయముంటది గునమత్తది"

అందరు గామాటమీద మాట్లాడుకోని గదేఖాయంజేసుకున్నరు. కూల్లు, జీతాలు మాతరిం వాల్లన్నంత పెరిగినై.

మీటింగయిపోయింది. ఎక్కడోల్లక్కడలేసిపోతన్రి.

"ఒక్కనిమిషం ఆగున్రి" గట్టిగ కేకపెట్టిండు వీరేశం

ఎక్కడోల్లక్కడ ఆగిపోయిన్రి.

"తప్పులందరుజేత్తరుగని సరిదిద్దుకునోడే బుద్ధిమంతుడు" అన్నడు అందరికేసి సూసుకుంట.

"ఇప్పటికన్న పోలీసులపిలిపిచ్చింది. నేనేనని గింతమందిల తప్పైందని ముక్కు భూమికిరాత్తె అందరికీ మంచిది."

అందరు ఔఔ అన్నరు.

మోతుబరులు ఒగలముకాలొగలు సూసుకున్నరు.

ఎవలు మాట్లాల్లేదు.

"సరె తియ్యి! మనం అఖరిదాన్నిగుడ యిచ్చినం ఇగమన తప్పైతెలేదు పోదాం పానిరి" అన్నడు ఈరేశం.

అందరు కదిలిన్రు మోతబరుల మనసుల గుబులైంది. ఉరిమివురిమి పిడుగు ఎవలమీదపడ్తదోనని.

4

పొద్దం తున్నది. తప్పుజేసినోన్ని తప్పుజేత్తున్నపుడే దొరుకపట్టినపోల్ల యిజ్జతు పోయి. ఏమనరాక కోపంతోటి మొకమంత ఎర్రపడ్డట్టు మొగులు ఎర్రబడ్డది.

తొవ్వపొంట గొడ్డు గోదులు దుమ్ములేపుతున్నయి.

గొడ్డుపోయిన రెండు మామిడిసెట్ల నీడకింద పొద్దంగెదాక గొడ్డుగోదల మందలు పెట్టుకున్నట్టున్నరు. కిందంత రొచ్చురొచ్చున్నది. పెండంత ఎవలమందది అల్లు యేరెపెంటకుప్ప జేసినట్టున్నరు. తాటిముంజలు తీసిన ఉత్తబుర్రిలు, ఎండి పెయిన గెలలు, తాటిమట్టలు, పొయిలకక్కరకత్తయని ఎవలో సెట్టుకింతదూరాన ఎండతలిగేకాడ మండెలుపోసుకున్నట్టున్నరు.

గొడ్లగాసె పిలగాన్లు ఈతపండ్లగెలలు తెచ్చుకొని తిన్నట్టున్నరు. మామిడిసెట్టు మొదలుకాడ అన్ని ఎండిపేయిన ఈతగింజలున్నయి.

అన్నరమ్మంటున్నడని రాజన్నను తోలుకొని మొగిలి, ఈరేశం, శంకరి ముగ్గురుగలిపి ఆ మామిడి సెట్టుకాడికి సేరిన్రు.

అక్కడ పెద్దన్నవున్నడు.

"నమస్తే అన్నా" అన్నరు అందరొకటేసారి "నమస్తే" అన్నడు పెద్దన్న'

పెద్దన్నను సూసెటాల్లకు తననేపుస్నజేత్తరో అని రమ్మంపెఠర్కన్నె అన్తి! అయ్యో! ఎవనికన్న సెప్పకపోతి అని బయపడ్డడు రాజన్న.

పులి ముంగట మేకను గట్టేసినట్టు బయంతోటి బీరిపోయిండు రాజన్న.

"నమస్తే రాజన్నా" అని నవ్వుకుంట మందలిచ్చిండు పెద్దన్న.

నమస్తే అన్నడు రాజన్న బెరుకుబెరుకు కొంచెం పోయినట్టయింది రాజన్నకు. అదిగాక పెద్దన్ననే తనకు నమస్తె పెట్టెటాల్లకు 'పెద్దన్న నాకు నమస్తె పెట్టిండు' అని మనుసుల కొంచెం సంబ్రిపడ్డడు. నన్ను పెద్దమనిషిగనే సూత్తున్నరుగద నన్నేం జెయ్యరుగని అని కొంచెం ధైర్యంతెచ్చుకున్నడు రాజన్న.

భూమిలకు దిగిన సెట్టు యేర్లమొదల్లు మీదికిదేలినై మందగానే పిలగాన్లు కూసుండి కూసుండి నున్నపడ్డ మొదుసులమీద సదురుకొని కూసున్నరు ఆల్లు,

'రాజన్నా!' పెద్దన్న రాజన్నకెయి తిరిగిపిల్సి అన్నడు. 'తెల్సితెల్సి ఊత కాయ్యెల్లపద్తె ఎట్లనే' అడిగిండు. రాజన్న గుండె దణదణగొట్టుకున్నది.

'నువు నైజాం జమానుల కామెరిడ్లకు సద్దులందిచ్చినవు. పదిపన్నెండేడ్ల పిలగానివి గపుడు! గపుడే నువ్వు ఎంతో పనిజేసినవు. రజాకార్లను, మిలిటిరివాల్లను ఎట్లతప్పిచ్చుకొని తిరుగాలె అన్నలకు ఎట్ల సద్దిఅందియ్యాలె అనేది నేర్చుకున్నవు. అన్నలెక్కడెక్కడుంటరో నీకుతెల్సినా ఎవలకు జెప్పతేదు నువు.

ఓ సారి ఓ రజాకారుగల్సి సద్దెటురా అని ఊడ్చి సెంపమీదికెల్లి నాల్గయిదు సరిత్తె దోతిలేరుక్కున్నపుగని ఏంజెప్పలేదు. మా అయ్యకే సద్దిదీస్కపోతున్న అని ముందుగాల జెప్పిన మాటమీదికెల్లి దిగలేనువ్వు

రాజన్న జేసిన ముచ్చట్లు యాజ్జేసిండు పెద్దన్న.

రాజన్నకు గట్లయాజ్జేత్తంటె ఎంతో సంబ్రిమైంది. గొప్పయారునితీర్గ మనసు ఇదైపోయింది. పాత ముచ్చట్లన్ని యాదికచ్చినై.

అవు! అపుడు గంత సిన్న పోరడుగని ఎంత పనిజేసిండు ఏంత ధైర్యం.

గవన్ని గిపుడు మెచ్చుకునేటాల్లకు సంతోసంతోటి పెయ్యంత జడితిచ్చింది.

మల్లందుకున్నడు పెద్దన్న "గపుడు మీరుగుంజుకున్న భూములన్ని మల్ల దొరల పాలే అయినయి మల్ల ఎక్కడేసిన గొంగలి అక్కన్నే వున్నట్లైంది. దెంకపోయిన దొరలు మల్లచ్చి దొరతనం సాగిచ్చుడు మొదలుపెట్టిన్రు,

'సదాంట్ల నీతప్పేంవున్నదిగని'

రాజన్న గాలిగొట్టిన బుగ్గతీర్గ ఉబ్బిపోయిండు.

శంకరి బీడిముట్టిచ్చిండు. అదే అగ్గిపుల్లతోటి మొగిలిగుడ బీడిముట్టిచ్చుకున్నడు.

గొండ్లోల్లు కల్లమ్ముడైనోల్లు కాపడి ఖజాని కేసుకొని ఇంటిలొవ్వ పట్టుకున్నరు కాపడికి వాడుకం బింకులో ఏమో అటు రెండు యిటు రెండు యాల్లాడుతున్నయి.

'గట్లపోతున్నది. యెల్లన్ననేగాదు' అన్నడు ఈ రేశం గట్ల దూరంనుంచిపోతున్న నడుత్తున్నగాండ్లాయెను సూపుకుంట.

'గట్లనే వున్నడు' అన్నడు పరీక్షపట్టి సూసుకుంట మొగిలి.

మొట్టుమీదికెల్లి కొంచెం జారినట్టయి మల్లసదురుకొని కూసున్నడు పెద్దన్న.

'కని అప్పట్నుంచి మీలీదర్లు ఎలక్షన్లంట దానెంబడిపడ్డరు. మీ లీదర్లు జెప్పినట్టు నువ్వున్నవు నీతప్పేందిగని. కని నువుగూడ కొన్నికొన్ని మంచి పన్లేజేసినవుగని గొండ్లోల్లను సంగంపెట్టుకొమ్మని యెంబపడి పెట్టిచ్చినవు. చేనేత సంగంబెట్టిచ్చినవు. పొరుగూర్లున్న దొంతగ్గరికోయె పంచాదులన్ని సూల్లెనే తప్షఅయేటట్టుజేసినవు. దొరలు కలాల్ మాంలాగుత్త పట్టనిత్తలేరని మసూరోల్లను గొట్టిచ్చి మనోట్లమీదనే కేసులువెట్టి నువ్వు వకీల్లపెట్టిచ్చి కొట్లాడినవు. ఎవనికి జెనుకలె. హరిజనులకు కొట్లాడి యిండ్ల జాగలిప్పిచ్చినవు. కొందరికి కరెంటుబాయిలుగూడ మంజూరి చేయించినవు. ప్రాథమిక వ్యవసాయ సహకారబ్యాంకు పెట్టిచ్చినవు. బ్యాంకులల్ల అప్పులు కావాలనోల్లకు అప్పులిప్పిచ్చినవు. గిసొన్నిపనులు జేసెటాల్లకు నీకు నీస్వంతం పనిజేసుకునటానికి టైందొరుకకుంటైంది, ఇగగందుకే నువుజేత్తున్న పనులల్ల కర్సులైనదాంట్ల గొన్ని నీకర్సులుగూడ గల్పి వసూలుజేసుకొన్నవు. కని అదిగూడ పెద్దతప్పేంలేదు. మరి నువ్వెట్లబతుకాల్నె. నీగ్గూడ కడుపున్నదిగదనే. కని నిన్నుగిట్టనోల్లు పైరవికారు అన్నరు. అంటే అసని అని నీపనినువ్వు చేసుకుంటబోయినవు. అనాడు ఏం లేనోనివి యియ్యాల యింత భూమికొనుక్కున్నవు. ఇంత బ్యాంకుల అప్పులిచ్చెటాల్లకు బావులు తవ్విచ్చుకున్నవు, బ్యాంకులు అప్పులిత్తె కరెంటుమోటార్లు పెట్టిచ్చుకున్నవు. ఇప్పుడుగొంచెం మంచిగనే బతుకుతున్నవు. మోతుబరులకంటె కొంచెం మంచిగనే అయినవు నలుగురు పిలగాల్లున్నరు ఇంత సంపాయించుకున్నవుగని గిదీన్నిగూడ యిపుదేమంటలేను''

అని పెద్దన్న రాజన్న పుట్టుపూర్వాలన్నీ జెప్పిండు.

ఎక్కడెక్కన్నో తిరిగే రాజన్నకు మనగ్గూడ తెల్వని సంగతులుగొన్ని ఎట్ల తెల్సినయని, పూసగుచ్చినట్టు సెప్పుతున్నడు అదె అని విచిత్రపడ్డరు ఆల్లుముగ్గురు.

"అన్నిమంచిగనే సేసినవుగని ఒకకొన్నె పోగొడ్తున్నవే రాజన్నా" అన్నడు మల్ల పెద్దన్న కొంతంగనే.

కని గా మాటనేటాల్లకు రాజన్నగుండెల బాయిల బండేసినట్టయింది. సేను గీడిదాక వోయత్తఅని సేసిండు ఈరేశం తాల్లకేయి నడిపిండు.

"యీల్లు సంగంబెట్టుకొని సమ్మెజేసినపుడల్ల నువ్వుగిట్లెట్లఅని కొట్లాటపెట్ట లేదు ఇటు ఊల్లను అటు మోతుబరులను ఇద్దర్ని సముదాయించి కూలీలు జీతాలు పెంచుటానికి తోడుపడ్డవు. ఇపుడు మీవూల్లె కూలీలు, పక్కవూంటి సల్లెలకంటె ఆటానా రూపాయి ఎక్కనే వున్నయి. జీతాలైతే మున్నూరుదాక ఎక్కేవున్నయి. గివ్వన్నిసరే మంచిగనేసేసినవ్ కాదన! అందరికి అన్నితీర్ల సాయంజేసినవు. గందుకే మొన్నవోట్లల్ల నిలవడితె నువుజేసిన సాయానికి అదలుకు బదలుతీర్గ నీకు వోటేసి సన్మానించి జేసిన్రి. కని గపుడు గింతకూలీలు జీతాలు పెంచిపిచ్చినంక గుడ నాకు వోటెయ్యరామీరు! అని, ఓట్లను బహిష్కరిస్తరా? అని, మనసుల కోపం పెట్టుకున్నవు. యిరువైమూడోట్లు ఎక్కేఅచ్చి గెల్సినవు. కొద్దిల అటుయిటు అయితే ఓడిపోతువుగద! నాకు వోటేస్తె ఊల్లె ముల్లెంమునిగిపోవు. ఊల్లె వోట్లెయ్యకపోతే ఎవడో ఒగడు గెల్వకఅగుతదా? అని అనుకున్నవు. గిట్ల అను కుంటుగూడ నీ మనుసుకు పట్టిసూత్తె నిజమేగానచ్చు. నువ్వు గట్ల కోపంబెట్టు కున్నందుకుగుడ నిన్నేమంటలేను. సాయంజేసినకాడ ఎవరైన యింతఆశపడ్తరు గద! కని మా పార్టీపాలసీ ఎవకో ఒకలకు ఓటేసుడుకాదుగదనే! ఓట్లతోటి వాగడువోయి ఒగడెక్కుతడుమీద. కని ప్రజలనెత్తిమీద ఎక్కుడైతె పోదుగదనే. గందుకు ఈ వ్యవస్థనే మారాలెగని ఎక్కేమనుసులు. దిగేమనుసులు గాదుగదనే. గిట్లమేం నమ్మ తున్నమని గూడ నీకుతెల్వొందిగాదు. గట్లతెల్సిగూడ ఆశపడుడు మా తప్పెట్లయితదే." తాళ్లకోయిన ఈరేశం కమ్మదొప్పల యిన్ని ముంజలు పట్టుకచ్చిండు. అందరి ముంగట పెట్టిండు.

పొద్దుపూర్తిగగూకింది. మొగులుమీద ఎర్రరంగు యిచిత్రంగ మాయమై తాంది.

యిగరాటనుకొని మిగిలిన కల్లుకుండలు కావడిబద్దకు తలిగేసుకోని ఆకరోల్లు గూడ ఎల్లిపోతాన్రి,

ఎవలో యింట్లపిలగాండ్లకోసం ముంజలగొల కావడికి తలిగేసుకున్నడు.

కల్లుమందువకాడ బజ్జీలమ్మె అయిలిగాడుగుడ సదురుకొని ఎల్లిపోతండు.

అంత దూరాన్నుంచి టునికాకు డాగులు తీసుకపోతున్న ఎడ్లకచ్రిం బరువుకు మెల్లమెల్లగ బోతున్నట్టున్నది.

కచ్రింఆపి ఎవల్నోబిలిసి బ్యారంజేసి యింతకల్లుబొట్టు తాగుతున్నట్టున్నడు ఎడ్లతోలుతున్నమనిషి.

మంచియో చెడ్డయోగని సువ్వుజేసిన అన్నిటికీ ఓర్చుకున్నం. కని నువ్వొకటి మర్సిపోయినట్టున్నవు సంగం బెట్టుకున్నది ఒక్కకూలీలు జీతాలు పెంచిపిచ్చుకున టానికేగాదే తమమీద ఎవలపెత్తనం లేకుంటగుడ సూసుకునుడుగూడ సంగంపనేనే. గందుకే ఏదన్న వాల్లండ్లవాల్లకు పంచాదు పడ్డ, వాల్లతోటి యింకోల్లకు పంచాదుపడ్డా, పంచాదులెంపేది మధ్యవర్తులుగాదే. సంగం ఆ పనిజేత్తది,

నీకు గిక్కన్నే కోపమచ్చింది. నాపెద్దిర్కం పడిపోతున్నదని కషగట్టినవు. కని ఒకటిగమనించుతలేవు. పెద్దపెద్దదొరలంత మట్టిగరుస్తున్నరు. నువుసూత్తలేవనిగాదు

'గంత పెద్దపెద్దదొరలు మాటనే పన్నపుడు నీదెట్లసాగుతదనుకుంటున్నవే?'

ఒక్కొక్కముంజ పొట్టుదీసి తింటున్నరు అందరు. ముంజలై పోయినట్టున్నయి ఒక్కటి మిగిలినట్టున్నది. నువుదిను అంటె నువ్వేదిను అని అనుకొన్నంక ఆఖరికి పెద్దన్నతీసుకున్నడు.

సెట్టుకింద మొకాలుకనపడనంత సీకటైంది.

సీకటైందేనయమనుకున్నడు రాజన్న తను బయటపడ్తున్నది తెల్వకుంటైందను కున్నడు.

ఓసారి సంచిల సెయ్యిపెట్టిండు పెద్దన్న. రాజన్న గుండె గుబిక్కుమన్నది. కత్తేదీత్తడో బాంబేదీత్తడో యింకేమన్నదీత్తడో, తీసిఏంజెత్తడో అని వులిక్కిపడ్డడు.

ముంజలు దిన్నసెయిని సంచిలున్న తువాలకు తుడుసుకొని మూతిగూడ తుడుసుకొని మల్ల సదిరిండు పెద్దన్న.

"హవ్వల్ల!" అని మల్లకుదురుకున్నడు రాజన్న.

"వూర్లే నీమాటనేయినాలనేది యిడిసిపెట్టు. నీబతుకేందో సువ్వుబతుకు. అప్పులు అవ్వోటివోటి ఉప్పిత్తె యిప్పియ్యిగని కమీషన్లు గుంజుడుమాత్రిం యికనుంచి కుదురది. కర్చులపేరిట వసూలుజేత్తెగుడ ఎవలూకోరు" ఖరాకండీగ చెప్పిండు.

మొగిలి అందుకున్నడో మాట

"గంతేగాదు. గ్రాంపంచాయతి పెండ అర్రాసుపైసలు. బంజెరుదొడ్డి పైసలు లెక్కజూపియ్యాలె. మేం బడిల అర్రిలుసాల్త లేవని రెండర్రిలు గట్టిచ్చటానికి వసూలు జేసిన పైసల లెక్క మేంజూపిత్తం. గ్రాంపంచాయతి పేరుమీద మీదమీద జమజేసి లెక్కరాయకుంట తిన్నపైసలుమాత్రిం నువ్వు లెక్కజూపిచ్చి యియ్యాలె. ఆవిటితోటి బల్లెపోరగాన్లకు బెంచీలు జేపిత్తం. నువు లెక్కసూపియ్యకపోతె సంగం మీటింగైనపుడు అందరు గల్సి ఎంతలెక్కదీత్తరో గంతకు ఒప్పుకోవాల్సివత్తదిమరి." అని అన్నడు.

'మంచిది మంచిపనికుపయోగపడ్తయంటె అడ్డంటనా' అని అన్నడు రాజన్న.

'సీకటైంది. యిగపోదామా' అన్నడు పెద్దన్న. అందరు లేసిన్రు.

'మీరునడువున్రి. మొగిలి నన్ను గీడిదాకపడగొట్టి అత్తడు' అని పెద్దన్న అన్నడు. మొగిలి పెద్దన్న ఆన్నే ఆగిన్రి.

మిగిలినోల్లు అచ్చినతోవెంట ముంగటికి నడిసిన్రి.

రాజన్న మనసుల మనసులేదు అన్నయన్ని మల్లయాజ్జేసుకొంటున్నడు.

ఇంతకు నన్ను మెచ్చుకున్నరా! తిట్టినార్రి మర్యాదగ అడిగినార్రి! బెదిరిచ్చినార్రి? ఏది సమజుగాక బుర్రింతగోక్కున్నడు. ఆలోసించుకుంట నడిసెటాల్లకు తట్టుకొని బోర్లపడబోయి తమాయించుకున్నడు.

'ఏమాయెనె సీకట్లసూత్త లేవ' అన్నడు శంకరి.

'సీకట్ల కనపడకపాయె' అన్నడు రాజన్న.

ఏమ్మాట్లాడ్తలేరు. సప్పుడుజేక నడుత్తున్నరు.

రాజన్నకు ఒక ముచ్చటైతే ఎంతకు సమఝైతలేదు. మొన్నగంతగనం లొల్లయి పానాలమీదికచ్చిన పోలీసోల్లను పిలిపించిందెవలు అని ఒక్కమాట అడుగకపాయె ఏంది అని, పెద్దన్న గట్ల అడుగకపోయెటాల్లకు "నువ్వేపోలీసుల పిలిపిచ్చినవటగద! ఏంసంగతి? బతకబుద్దైతలేద వూల్లె" అని అన్నదానికంటె ఎక్కువ పరేషానైతండు. ఇంతకు తనను యీల్లునమ్మినట్టా? నమ్మనట్టా? గట్ల అనుకుంటనేవున్నడు ఆలోచనలు ఎంతకు ఎడతెగుతలేవు.

శంకరి ముంజలుయిగ అయిపాయె దగ్గరపడె అని ఏదోముచ్చట ఈరేశంతోటి మాట్లాడుతండు. వానలెప్పుడు వత్తయి ఈ యేడు పంటలెట్లుంటయో గసొంటి ముచ్చట్లు మాట్లాడుతండ్లు.

ఊరుజేరచ్చిన్రు. ఎవరిండ్లల్లకాల్లువోయిన్రు. ఆ రాత్రింత ఆలోచించుతనే వున్నడు రాజన్న.

5

గిడిజరినంక పాయిందెసాలకు పోలీసులచ్చి మొగిలిని, శంకరిని, ఈరేశంను ఏదోవూరికోయిరాంగ తొవ్వల పట్టుకున్నరు. ఉసన్నేసి పొట్టుపొట్టు గొట్టిన్రు. మూడ్రోజులకు కేసుగీసు ఏంబెట్టకుంటనే యిడిసిపెట్టిన్రు. వూరోల్లకు వాళ్ళచ్చేదాక గీసంగతి తెల్వది. ఏదో వూరికోయిండ్రనే అనుకున్నరు.

యింతల వోనాడు పోలీసులబిలిపిచ్చి ముందుగాలగొట్టిచ్చిందెవలో తెల్వ పోయింది. అందరనుకోని ప్రజాకోర్టు బెట్టిన్రు. కమినిట్టు రాజన్నను మందిముందల నిలబెట్టిన్రు.

"యిదంతెందుకు జేశినవో యిప్పుడీమందిముందల సెప్పాలె" అన్నడు మొగిలి రాజన్నతోటి

రాజన్నమొకం తుమ్మల్ల పొద్దుగూకినట్టయింది. తల్కాయెవంచుకోని నిల వడ్డడు. అట్లనే తల్కాయెవంచుకోని కండ్లుమాత్రం ఎత్తి మందివంక చూసిండు. అందర్ని జూడంగనె దద్రింబుచ్చుకున్నది. ఆనాడు పెద్దన్న వదిలిండుగని యియ్యాల మంది వదిలెటట్టులేరు అనుకున్నడు. అంతమందిల ఎవడో పద్రిముని అగ్గిపుల్ల గీకిండు. పక్కనున్న యాపచెట్టుమీద ఓకాకి కయ్యర కయ్యర ఒర్రిత్తాంది. ఆ

యాపసెట్టు సందుల్లకెల్లి ఎండ రాజన్న మెడ మీద సురుక్కు సురుక్కుమని పొడుత్తాంది.

"యిగ పన్లేపని ఆడు మొదట్నుంచి జేసయి యిశారించుని్రి" అని మందిల కెల్లి ఎవడో అన్నడు.

"యిన్నేండ్లకాంచి ఎన్నిజేసుకుంటత్తాండు. ఆవిప్పిత్త. యివిప్పిత్తఅని పైరవి జేశెటాన్కి పైసలుగావాల్నని ఎన్ని వసూలుజేశిండు ? యిప్పుడయన్ని బయ టకి గుంజాలె" అని మందిదిక్కుజూసి "చెప్పరేంవురి్ మీరంత బోర్ల బడ్డోలు గాదా." అన్నడొగడు. రాజన్న వంచినతలెత్తలె. కాల్లల్ల వణుకుడుబుట్టింది. ఆ వణుకుడు కనబడితె మానంబోద్దని నిర్రిదన్ని నిలబడ్డడు.

"మంచిఅడుగుతాంటె జెప్పవేంది. యినోరిజలుజేసింది ఎవడుబట్టిచ్చుకోలె యిది గట్లనేవోతదనుకున్నవు కనియ్యాల నీపాపం బండింది. అన్నల బట్టిచ్చెటాన్కి జూసినప్ అన్నలకిగోసబడి తప్పిచ్చుకున్నరు. పెద్దన్నవచ్చి నీసంగతి నీకుగురుతు జేశిపోయిండు అప్పుడుగ్గుడ నువుదెల్సుకోలె మళ్ళ మమ్ముల బట్టిచ్చినప్ యిదంత వట్టిగనేమాట్లాడతలేం. నీపన్లకు సాక్షం నీవోల్లె ఎంకటిగాడు, మల్లిగాడు యిద్ద రున్నరు. యింతేమందిల వున్నదున్నట్టు శెప్పు, మంది శెప్తరు. అందాక రానిత్తవా లేకపోతె తప్పయిందని ముందుగాల నువ్వే వొప్పుకుంటవా ?" శంకరి అన్నడు

రాజన్నకు బట్టలిడిపిచ్చి బరిబత్తల నిలబెట్టి అందరు తుప్పర తుప్పర వూంచి నట్టయింది. ఏంమాట్లాడెటాన్కి తోసలె. అందరికి అంతఎరికె. తంతరో, గుద్దు తరో తప్పయిందని ఒప్పుకుంటె నాలుగుమాటలని మందలిచ్చి వదిలిపెడుతరను కున్నడు. చిన్నగ మెడలెత్తి "చేశినయన్ని తప్పులె యిప్పుడు మీరంటాంటె దెలు త్తాంది. యింగ ఈసారికెయ్య" అన్నడు మెల్లగ. ఆ మాటలు మొగిలికి, శంకరికి, యీరేశంకుతప్ప ఎవలికినబడలె.

"ఏమో అంటదేందివాడు జరంత గట్టిగసుమనాదుని్రి"

"ఏందో అక్కన్నె గుయ్యగుయ్యమంటాండు ?" మందిలకెల్లి మాటలిన బడ్డయి.

"తప్పయిందట ఒప్పుకుంటాండు" యీరేశం అన్నడు.

"అదే! మీకేజెప్తడటనా మా అందరిదగ్గెర పైసలు దొబ్బెదెరికేగని, మా కొం పలుముంచి మమ్ముల౦దర్ని యింటిసుట్టు దిప్పుకునుడెరెకెగాని యిప్పుడేమో మీ చెవు లల్లనే తీకనాలుదీత్తాండు?" ఒగడన్నడు.

"గదేందో గట్టిగజెప్పుమనాగ్రిదునిగ్రి" ఒరిగ్రిండొగడు.

"అందరికీనపడెటట్టుజెప్పు" మొగిలి రాజన్నతోటి అన్నడు. రాజన్న సచ్చిన పీనుగతీర్గ అయిండు యిగతప్పదనుకున్నడు. మానంబోతెమాయె పానంనిలుత్తదను కున్నడు

"తప్పయింది యిసుమంటిపన్లు యిగజెయ్యనుల్లా" అన్నడు జెరగట్టిగ, అమాటలు గూడ సగం మందికె యినవడ్డయి.

"తప్పయిందంటాండుగద యిప్పుడేంజేద్దాం మీరేజెప్పాలె" ఈరేశం మంది తోటి అన్నడు.

"అప్పల్లో తప్పయిందనంగనేఅయిపోద్దా గుర్తుండెటట్టుజెయ్యాలె"

"చేసినయన్నిజేశి తప్పనంగనేబోతయా శిచ్చపడాలె"

మొగిలి, శంకరి, ఈరేశం ఒగలమొకాలొగలు సూసుకున్నరు ఏంజేద్దామను కున్నట్టు.

"దొంగగొడ్డుకు లొటారమెయ్యాలె, దొంగగొడ్డుకు లొటారమెయ్యాలె" మంది ఒరుగ్రితాసుగ్రి.

* * * *

రొండ్రోజులయినంక చేతికి సిమెంటు పట్టేయిచ్చుకోని దొంగగొడ్డుకు లొటారం గట్టినట్టు నెలరోజులు సెయ్యితాడు మెడల యాల్లాడేసుకోని తిరిగిండు రాజన్న.

---

పాలస్తీనా కవిత

# నేల తల్లీ !

అబూసల్మా

ఒద్దు, అడగకు నన్ను
మాతృభూమికోసం, ఆత్మీయులకోసం
నేనెంత పరితపిస్తానో అడగకు నన్ను-
జవాబు భరించలేను
సుదూరాన పాలస్తీనాలో
మెరుపును తలచుకున్నప్పుడల్లా
నాగుండె పగులుతుంది
మనసు నీరవుతుంది

మైదానాల మీద
సముద్రపుటలలవలె మేం వెళ్ళిపోయాం
ఆకాశం మీద
మేఘాల వలె మేం విడిపోయాం
ఓ పాలస్తీనా!
నీ కోసం మా ప్రేమలో ఆకాంక్షలో
మేం దుఃఖాన్ని భరించాం
హింసనూ భరించాం

మేం ఎక్కడివాళ్ళమని నువ్వడిగితే
మాకున్నదొకే ఒక్క జవాబు-
నీకే, నీకు మాత్రమే చెందుతాం మేం
ఈ నేల నుంచి ఎడబాటు
మమ్మల్నిమళ్ళీనీ నేలకే దగ్గర చేస్తుంది

బాణాలై ఈటెలై మొలకెత్తేందుకు
మేం మా ఆకాంక్షల్ని
ప్రతి నేలలోనూ నాటాం
ఔను-మనం విడిపోయాం
ఐనా
అవమానాల బహిష్కారాల
సంవత్సరాలనిండా దశాబ్దాలనిండా
నువు మా హృదయాల్లో
బతికే ఉంటావు

పాలస్తీనా-
మనం మళ్ళీ కలుసుకుంటాం
కొందరం తలలు పండి పోయి
కొందరం వేడి నెత్తురుతో
మళ్ళీ నీ ఆటస్థలాల్లోకలుసుకుంటాం
మేం నీ ముందు మోకరిల్లి
నీ రాళ్ళను ముద్దాడతాం
నీ ఇసుకను ముద్దాడుతాం
నీ గులకరాళ్ళని ముద్దాడుతాం
నేలతల్లీ, నిన్ను ముద్దాడుతాం.

('పాలస్తీనా' పక్షపత్రిక 1983 మార్చి 16-31 సంచిక నుంచి)

## అమరుడా లచ్చయ్యా!

ఎ. అప్పన్నాయుడు

అమరుడా.... లచ్చయ్యా
అందుకోవయ్యా
ఎర్రెర్ర జోహారు
లందుకోవయ్యా ॥అమ॥

శ్రీకాకులం జిల్లాలో
కోమర్తి గ్రామంలో
పేదవాడిగ పుట్టి
పేదోళ్ళ వెలుగయి
పోరాటమార్గాన నడిచావు
అమరుడవై నేటికీ నిలిచావు ॥అమ॥

ప్రజలనే మేల్కొల్పి
పార్టీని నెలకొల్పి
కష్టజీవులనంత
కమ్యూనిస్టులజేసి
ప్రజతంత్రి పాలనకు కదిలావూ
ప్రజలకొరకై నీవు ఒరిగావు ॥అమ॥

పోలీసు దుండగులు
కొండల్లో నినుబట్టి
ఊచకోతలు కోసి
పెట్రోలు పై బోసి
కాల్చినా పేల్చినా కుర్రింగనీ నీ గుండె
ఎర్రజెండానింకా ఎత్తుగానిల్పింది॥అమ॥

నీవారము మేము
నీబాట నున్నాము
కష్టాలు నష్టాలు
ఎదిరించి నిలిచాము
అమరులా లక్ష్యాన్ని సాధించుతాము
శ్రామికుల రాజ్యాన్ని స్థాపించుతాము
॥అమ॥

అమరుడు, కామ్రేడ్ గుమ్మడి లచ్చయ్య నరసన్నపేట తాలూకా కోమర్తి గ్రామ రైతాంగ పేదల సమితిసభ్యుడు. భూస్వామ్యవ్యతిరేక, వర్గపోరాటాల్లో గ్రామ పేదలకు ఆదర్శవంతంగా ముందుండి చురుకుగా కార్యక్రమాలు నిర్వహించేవాడు. భూస్వాములకు లచ్చయ్య అంటే చిచ్చరపిడుగు.

పార్టీయిచ్చిన పిలుపునందుకొని, సాయుధుడై శ్రీకాకుళ రైతాంగపోరు సైనికుడైనాడు. తేది 2-4-1970 న చాపర ప్రాంతంలో పోలీసులు లచ్చయ్యను అరెస్టుజేసారు. 15రోజులపాటుగా నాయకుల, స్థావరాల వివరాలను పార్టీరహస్యాలను చెప్పించాలని పోలీసులు చిత్రహింసలుపెట్టారు. అయినా. నీపేరు? అనిఅడిగితే "నక్సలైట్", నీదేవూరు? అనడిగితే "భారతదేశం" తప్ప మారుమాట్లాడని వీరుడ్ని పెట్రోలుపోసి తూటాలు పేల్చి కాల్చిచంపారు కిరాతక పోలీసువర్గాలు।

## వాషావిరి

అల్లం రాజయ్య

మీ యింబెనుక మాయింబెనుక ఓరాసగుమ్మడీ

ఏమేమిగుడ్డలు బోత్తామక్క ,,
మబ్బులొచ్చె మబ్బులచ్చె ,,
మబ్బుల మీద మబ్బులచ్చె ,,
మబ్బులచ్చి మొగులు జేసి ,,
వానల మీద వానలు గొట్టె ,,
వానల మీద వానలు గొట్టె ,,
వరదల మీద వరదలొచ్చె ,,
వరదల మీద వరదలొచ్చె ,,
ఊర చెరువు ఉబ్బిపాయె ,,
ఊర చెరువు ఉబ్బిపోతె ,,
మక్కి పెల్లు వానకుబట్టె ,,
మీయింబెనుక మాయింబెనుక ,,
ఏమేమిగుడ్డలు వోత్తామక్క ,,
గుడ్డల మీద మన్నుబొయ్యె ,,
గుంపెడంత జాగాలేదు ,,
వానల మీద మన్నువాడ ,,
ఉండేటందుకు జాగలేదు ,,
మీఇంబెనుక మాఇంబెనుక ,,
గుమ్మడిగుడ్డలు బోత్తామక్క ,,
గుమ్మడిమీద మన్నువాడ ,,
గుమ్మిలొక్క గింజలేదు ,,
మీఇంబెనుక మాయింబెనుక ,,
చిక్కుడుగుడ్డలు వోత్తామక్క ,,
చిక్కుడుమీద మన్నువాడ ,,
సారెడంత గడ్క లేదు ,,
మీఇంబెనుక మాఇంబెనుక ,,
మక్కజొన్నలు వోద్దామక్క ,,

పక్కమీద మన్నువాడ ఓరాస గుమ్మడి
చెక్కలేదు చెల్కలేదు ”
మబ్బులమీద మబ్బులొచ్చె ”
అక్కవినవే నాటుబెడ్తాం ”
నాట్లుమీద మన్నువాడ ”
షికము తేదు-పొలము లేదు ”
అట్లగంటె ఎట్లనక్క ”
బతుకుదెట్ల చెప్పరాదే ”
బతుకుడుమీద మన్నువాడ ”
బొందకింత జాగాలేదు ”
గట్లనుంచి చెట్లదాకా ”
ఉన్నభూమి ఎవలదక్క ”
చెట్లనుండి చెల్కదాకా ”
ఊరిదొరలు పంచుకున్నరు ”
అట్లగయితె ఎట్లనక్క ”
గుడ్డలెక్కడ బోత్తామక్క ”
గుడ్డలులేవు బెడ్డలులేవు ”
గడ్డిలేదు గాదంలేదు ”
అట్లాగంటె ఎట్లానక్క ”
గుట్టుమట్టును వేచెప్ప ”
రైతుకూలి సంగముంది ”
రగల్ జెండా అండఉన్నది ”
అట్లాగంటె ఎట్లనక్కా ”
కాల్లుగజగజవనుకునక్క ”
భూములచ్చె మతలబుచెప్ప ”
గుడ్డలుబెట్టెగుట్టుచెప్పు ”
రైతులు కూలీలంతగూడి ”
గట్లనుంచి చెట్లదాకా ”
దున్నిగుడ్డలు బెట్టాలెచెల్లె ”

అట్లగంటె ఎట్లానక్కా ఓరాస గుమ్మడి
పట్టాభూములు దున్నవశమా ”
చెట్లుగొట్టినోడు ఎవడే ”
నాట్లుఏసినోల్లు ఎవలే ”
భూమిచేసినోడు ఎవడే ”
బువ్వపంచినోడు ఎవడే ”
ఎవలనడిగి పట్టాలిచ్చె ”
సర్కారోడు బాడ్ కాప్ ”
దున్నెటోనికిపట్టాలేదు ”
పన్నెకానికి హక్కులేల ”
కాకిబట్టాలత్తాయక్కా ”
తుపాకుల దెత్తాయక్కా ”
గుడ్డాలద్దు బెడ్డాలద్దూ ”
గుమ్మడద్దు చిక్కుడద్దూ ”
గుద్దులద్దు-తన్నులద్దూ ”
భూమిమనకు దక్కాలంటె ”
కొంగునడుముకు చుట్టాలమ్మా ”
బందూకొమనము బట్టాలమ్మా ”
బందూకంటె భయమేఅక్కా ”
గుడ్డాలేమొ పెట్టాలక్కా ”
భయంలేదుగియములేదు ”
భూములుంటె గుడ్డలుంటయి ”
మీఇంటెనుక మాఇంటెనుక ”
ఏమేమిగుడ్డలు బెడుదామక్కా ”
అక్క: మాఇంటెనుక మీఇంటెనుక ”
గుమ్మడిగుడ్డలుబెడ్తాంచెల్లే ”
చెల్లె: గుమ్మడిపూపింది గుమ్మడిగాసింది
గుమ్మడి కొనలన్ని ధర్నికొరినాయి
పచ్చిన పచ్చిపలే గౌరమ్మ
మాభూమి మాకొచ్చెనే....

(దసరాపండుగకు తెలంగాణాలో ఆడే బతుకమ్మ ఆటలో పాడేపాట 'ఓరాస గుమ్మడీ' బాణీలో పాడుకోవాలి.)

## బొంబాయి మిల్లుకూలోల్లం

వి. సత్యం

మిల్లుకూలోల్లమయ్యో
అయ్యయ్యో మేము
గుడిసె పాలోల్లమయ్యో

బోల్లబిందెలు అమ్మి
బొంబాయికి బతకొచ్చి
కాల్లేల్లుపట్టుకోని
కంపెనిలో పని కెక్కి
బదిలిపాసు మారకపాయె
బదు పగారు దొరకకపాయె
పదియేండ్లు నిండినంక
పర్మినేంటు కొలువాయె ॥మిల్లు॥

గరంగరం గాడుపొచ్చి
గాబరోలెకావట్టె
ముక్కులోన మూతిలోన
చెవులలోన శర్టులోన
దూదిపోయి దుమ్మిపోయి
ఒల్లంతా తడిసిపాయె
మిల్లంతా వడిసిపాయె ॥మిల్లు॥

కంపెని బయిలర్ లెక్క
కడుపుమంట ఆకలాయె
జెప్పజెప్ప డబ్బఇప్పి
కుక్కలోలె కూడుబుక్కి
కుతి కెబడినట్లుఆయె
కూ-మని పనిగంటమోగె ॥మిల్లు॥

మాపేగులు పీకిపీకి
పోగు పోగు అతుకుబెడితె
బతుకంతా అప్పులాయె
బాదలేమొ తప్పవాయె
నగదు పైసలులేక
నౌటాకుకే ఉద్దెరాయె ॥మిల్లు॥

జటా జటా జోటడిగి
పటాపటా దారంతెగి
పనిఇంట్ల పాడుగాను
జాపరొచ్చి ఙట్క ఇచ్చె
ఇంటికొత్తె గుడిసెపీక
మునసిపాల్టి నోటీసచ్చె ॥మిల్లు॥

సాదసాద సాంచపోయి
అటోమెటిక్ సాంచలచ్చె
పదిమంది అంతపని
ఒక్కనితో చేయించి
మిగిలినోల్లనందరిని
మెడలుపట్టి నూకేసే ॥మిల్లు॥

ఇరవయ్యేండ్లు పనిచేస్తె
అరవయిఏండ్ల వయసొచ్చె
కండలన్ని కంపెనిలో
కరిగి అరిగి తరిగిపాయె
సర్వీసు నిండిందని
సక్కగ ఇంటికిసాగమనే ॥మిల్లు॥

యజమానులు యజమానులు
పోటీబడి పోటీబడి
మిల్లుకూలోల్లరక్తం
నల్లుల్లా తాగుతుండ్రి
చెరుకురసం పీల్చి పీల్చి
చొప్పబెండు చేసిరయ్యో ॥మిల్లు॥

ఏయ్....!
హేయ్....!!
పోరుమనది హోరుమనది
పోరుసలిపే బాటమనది
కదం ముందుకు కదులుతున్నది
పదం ముందుకు పడుతుపున్నది
అరెరెరెరెరె ముందుముందుకె
సాగుతున్నది
పకడొఖాయ్-పకడొఖాయ్
పట్టిందెపట్టు-ఇడిస్తె ఒట్టు

ఏయ్....!
హేయ్....!!

పట్టిందెపట్టు.... ఐస
ఇడిస్తె ఒట్టు "
డొర్ ఖోడ "
ఇంకా కొంచెం "
కదం ముందుకు "
కదులు తున్నది "

# ఏయ్! హేయ్!! ఐస...

ఎన్నార్. 'ఖోలా'

పదం ముందుకు "
పడుతు పున్నది "

ఏయ్....!
హేయ్....!!

పోరుబాట చూపినోళ్లు
పోరుపాటలు పాడినోళ్లు
పోరుసలిపి అమరులయ్యిన
అన్నలాకు దండమూలు
అరెరెరెరెరె ప్రితిసబూనె
లాల్ సలాములు

ఏయ్....!
హేయ్....!!

పోరులోన.... ఐస
పోగయ్యిన "

---

కొండపైన కాలువలు
నదుల్లోకి కదులుతాయి
నదులన్నీ కదలికదలి
సముద్రంలో కలుస్తాయి
కార్మికుల మనచెమట
యజమాని ఖజానలోకెలుతది ॥మిల్లు॥

పయ్యలేసె నూనెలాగ
పైకంమనకిస్తుండ్రి
ఇరుసువెంట కూలోల్లు
ఇసురునలుగుతుండ్రి ॥మిల్లు॥

ఇండ్లుఇత్తం జాగలిత్తంఅని
ఎన్నికలపుడు లీడరొచ్చి
గొప్పగొప్ప గప్పాలుచెప్పె
ఓట్లేసిగెలిపిత్తె
ఉన్నాయి గుడిశెలుపాయె ॥మిల్లు॥

ఓట్లేయమని మల్లొత్తె
ఒంగబెట్టి తందాము
ఓట్లొద్దు సీట్లొద్దు
ఒగలమారి బొంకుడొద్దు
ఏలీడరు మనకొద్దు
లడాయెనోయి ఇకనుంచి ॥మిల్లు॥

జనం నాడి ఐస
కలిగి నోళ్లు ,,
జనం కళ్ల ,,
సీళ్ల కోతలా ,,
రాపిడి పెట్టిన ,,
రాడికల్లు ,,
సంగాలు ఎన్నో ,,
పెట్టినారు ,,
కూలిరాజ్యం ,,
కావాలన్నరు ,,

ఏయ్....!
హేయ్....!!

అరకపట్టిన పిడికిళ్లు
దున్నిన నాగేటి చాళ్లు
దుమ్మమనము దుక్కిమనము
గొర్రుకొట్టిన బుంగమనము
అరెరెరెరెరె ఎండిన డొక్కల్లుమనయి

ఏయ్....!
హేయ్....!!

మోకాలు దిగిన ఐస
బురద మనము ,,
మొలకలెత్తిన ,,
నారు మనము ,,
పులకరించి ,,
గుండెలవిసి ,,
పాలపొదుగుల ,,
పంటలిచ్చె ,,
భూమి మనమె ,,
భుక్తి మనమె ,,

కలుపుతీసి ఐస
కోతకోసి ,,
కుప్పలేసి ,,
జంపగొట్టిన ,,
పంటమనదె ,,
ఫలము మనదె ,,
దున్నుకున్న ,,
భూమి మనదె ,,

ఏయ్....!
హేయ్....!!

చెమట మనది చేవ మనది
చేతనున్న పనిమనది
ఇటుక ఇటుక పేర్చి కట్టిన
ఇండ్లూ బంగ్లాలు మనయి
అరెరెరెరెరె కళ్లకార్చిన వెతలు మనయి

ఏయ్....!
హేయ్....!!

చెమట నెత్తురు.... ఐస
పేర్చి కట్టిన ,,
ఇండ్లు మనయి ,,
బంగ్లాలు మనయి ,,
తోట మనదె ,,
పెండు మనదె ,,
పెండులోన ,,
సుంచులేసిన ,,
కర్రిమనదె ,,
కంకి మనదె ,,

ఏయ్....!
హేయ్....!!

# ఆదిలాబాద్ గిరిజన పోరాటాలు - ఒకపరిశీలన

ఎ ఎస్. మైత్రి

అక్కడి పర్వతాలు ఎరుపు
అక్కడి పువ్వులు ఎరుపు
ఆహా వాళ్ళ మరణం ఎరుపు
వాళ్ళకు మా జోహార్లు ఎరుపు....

సృజన మే' 83 సంచిక అట్టమీద గిరిజన మృత వీరులకు జోహార్లు పలుకుతూనే లోపల 'ఆదిలాబాద్ గిరిజన పోరాటాలు' అన్న బాలగోపాల్‌గారి వ్యాసం ప్రచురించారు. ఈ వ్యాసం ఏ ఉద్దేశంతోరాసినా అట్టమీది అక్షరాలతో స్పందించిన వాళ్ళకు తీవ్రమనస్తాపంకలిగిస్తుంది. ఈ వ్యాసంలో బాలగోపాల్ 'గిరిజన పోరాటాలు' వివరించేపేర ఆపోరాటాలను తక్కువచేసి చూడటం కనిపిస్తుంది.

బాలగోపాల్ ఈ వ్యాసంలో ప్రధానంగా మూడు అంశాలను తడిమారని నేను అర్థంచేసుకున్నాను. 1. ఆదిలాబాద్ గిరిజన ప్రాంతంలో భూమిసమస్య 2. 1940కి

---

మనదె సుత్తె మనదె పత్తువ
సుత్తెదెబ్బకు ముద్దముద్దయి
రూపుదాల్చి పదునుపట్టిన
కత్తిమనది పిడీమనదె
అరెరెరరెరె గుండెకోతల కతలుమనయి

ఏయ్....!

హేయ్....!!

స్పానర్లు పట్టి.... ఐస
ఫిట్టింగు జేసిన ,,
ఫ్యాక్టరీలు ,,
పరిశ్రమలు ,,

మనయి మనయె ,,
కొలిమి కాల్చి ,,
గన్ను లెత్తి ,,
పట్టాలు పోసిన ,,
రైళ్లు మనయె ,,
రెక్కలిర్సుక ,,
పాటు పడిన ,,
ఫలితమ్ము మనదె ,,
హోరు పెంచి ,,
జోరు పెంచి ,,
పోరు సలిపితె ,,
జయం మనదె ,,

(టింబర్ డిపోలలో పెద్దపెద్ద మొద్దులు కదిలించాల్సి వచ్చినప్పుడు, కరెంటు పోల్సు లేపునప్పుడు, రైలుపట్టాలు వగైరా బరువు సామాను ఎత్తవల్సివచ్చినప్పుడు కార్మికులను, హమాలీలను ఉద్రేకపరుస్తూ అరుస్తుంటారు. దానికి బదులుగా కార్మికులు పట్టు సడలకుండ "ఐస" అంటూ కసిగా తోస్తుంటారు.)

పూర్వం భూమిసమస్యకేంద్రంగా లేచినతిరుగుబాట్లు-ముఖ్యంగా కొమురం భీము నాయకత్వంలో జరిగిన బాబేఝరి ఘటన, 3 ఆదిలాబాద్ గిరిజన పోరాటాలను పరిశీలించడానికి హేమెన్‌డార్ఫ్ నివేదికలు.

ఈ మూడు విషయాలుకాక అప్రధాన విషయాలు కొన్నిటిని కూడ తడిమారు. వాటిసంగతి వదిలేస్తే ప్రధానమైన ఈ మూడువిషయాలు బాలగోపాల్ ఏకీకరించారని లేదా వాస్తవాలను తెలుసుకోకుండా ఒక నిర్ణయానికివచ్చారని నాకనిపిస్తుంది. పైగా తను తప్పుడు ఆలోచనలోఉండి విప్లవరచయితలు "గిరిజనులజీవితాన్ని రొమాంటిసైజు చేయగూడదు"ని హెచ్చరించడానికి పూనుకున్నారు.

ఈ వ్యాసం మొదలుపెట్టడమే వెన్నెలకంటి రాఘవయ్య వాక్యంతో మొదలు పెట్టారు. అటునుండి రాజ్యంమీద, గిరిజనుల ఆచారవ్యవహారాలమీద తమ అభిప్రాయాలు ప్రకటించి అందులోకి విప్లవరచయితలనుకూడ తెచ్చి వాళ్ళమీదకూడ తమ అభిప్రాయం వెలిబుచ్చి సలహాఇచ్చారు ఏ విప్లవరచయితలు ఎక్కడ రొంమాటిసైజ్ చేశారో ఆయన వ్యాసం మొత్తంమీద పాఠకుడికి అర్థంకాదు.

గిరిజనులపట్ల బాలగోపాల్ అభిప్రాయాలుచూస్తే "అజ్ఞానం నుండి, భయం నుండి పుట్టిన ఈ ఆచారవ్యవహారాలు (గిరిజనులను రాజ్యాంగంకన్న బలీయంగా కట్టివేసేవి) అన్నివిషయాల్లోను ప్రామాణికతను నిర్దేశిస్తాయి" అంటూనే అదేపేరా చివరిలో "గిరిజనుడు ప్రకృతితో పూర్తిగా సామరస్యంగా జీవించడు. సామరస్యమూ ఉంటుంది, ప్రకృతితో పోరాటమూ ఉంటుంది, పోరాటమే ప్రధానంగా ఉంటుంది" (పే. 5,6) అన్నారు. గిరిజనులు ప్రకృతితో పోరాడేటప్పుడు ఆ పోరాటం భావ, భౌతిక రంగాల్లోకూడ ప్రతిఫలించక తప్పదు. ఆచారాలు గిరిజనుల ప్రామాణికతను నిర్దేశించడం ఎంతవాస్తవమో వాళ్ళు వాళ్ళ జీవనసరళికి అడ్డంకిగాఉన్న ఆచారాలకు వ్యతిరేకంగా పోరాడడం అంతేవాస్తవం. నిజమైన విప్లవరచయితలు ప్రకృతిలోగాని మానవ సమాజంలోగాని ఉండే ఈ ఘర్షణను గుర్తిస్తారు. విప్లవరచయితల సాహిత్యం (నాకు తెలిసినంతవరకు ఇప్పటికీ పరిమితంగానే) ఈ సంఘర్షణను ప్రతిబింబించింది. ఇదే రొమాంటిసైజ్ చేయడంగా కనిపించిందని. అనుకోవచ్చునా? బాలగోపాల్‌కు అట్లాకనిపించడానికి కారణమేమిటో తర్వాతచూద్దాం.

బాలగోపాల్ తడిమిన గిరిజనప్రాంతాల్లో భూమిసమస్యచూస్తే "ఆదిలాబాద్ గిరిజన ప్రాంతం ప్రధానంగా కొండలప్రాంతం. మానిక్‌గడ్ పర్వతశ్రేణులు,

నిర్మల్ పర్వతశ్రేణులు, కందికట్ల గుట్టలు, రాఖీగుట్టలు ఈ ప్రాంతంలో ఉన్నాయి. ఈ గుట్టల దిగువగలప్రాంతాల్లో అడవినరికి, చెట్టుచేమ ఆకుఅలము తగులబెట్టి ఆ బూడిద సారంమీదే పోడువ్యవసాయంచేయడం గిరిజనుల వ్యవసాయపద్ధతి. రాళ్ళు, రప్పలు కలిగిన కొండప్రాంతాలలో 'కుక్కి' (ఒకసువ్వలాంటి పనిముట్టుతో బండల సందున రంధ్రించేసి గింజలువేసే పద్ధతి) వ్యవసాయంకూడ అక్కడక్కడ కనిపిస్తుంది. పోడువ్యవసాయంగాని, కుక్కి వ్యవసాయంగాని స్థిరవ్యవసాయంకాదు. ఎరువులవాడకం లేదుగనుక నాలుగైదుపంటలు తీయగానే అంతకుముందు చేసేనేలలో భూసారం ఖతమవుతుంది. దీనితో గిరిజనుడు కొత్తభూముల అన్వేషణ సాగిస్తాడు. కొత్తభూముల అన్వేషణఅంటే అడవినరకడమే. అప్పుడప్పుడే కొంత స్థిర వ్యవసాయం ప్రారంభించినా మొత్తంగాచూస్తే గిరిజనుల వ్యవసాయ పద్ధతిమాత్రం అప్పటికి ప్రధానంగా అదే".

బాలగోపాల్ తనవ్యాసంలో నైజాం పాలనకాలంనుండి ఈ సమస్యను తడిమాడు గనుక నేను అక్కడినుండే గిరిజనుల భూమిసమస్య ఏవిధంగా జటిలమైందో వివరించడానికి ప్రయత్నిస్తాను

బాలగోపాల్ ఆదిలాబాద్ ప్రాంతంలో సారవంతమైన భూములు ఉండడం అన్నవిషయం తీసుకొని పత్తిపంట సిద్ధాంతం ఒకటి ప్రతిపాదించారు ఇది నైజాం ఇంగ్లీషువాళ్ళనుండి గ్రహించాడని, "ఆదిలాబాద్ అడవులలోని నల్లరేగడినేల పత్తికి లాయకయిందన్న ఆలోచన ఇరవయవ శతాబ్ది ఆరంభంలో హైదరాబాద్ నవాబ్‌కు వచ్చింది" అని బాలగోపాల్ పత్తిపంట సిద్ధాంతాన్ని ముందుకు కొనసాగించారు చివరికి ఈ సిద్ధాంతం ఎక్కడిదాక వెళ్ళిందంటే నైజాంనవాబు పత్తిపంటకోసం పనిగట్టుకొని మైదానప్రాంతాల భూస్వాములకు గిరిజనుల భూములను వేలంపాటలో అమ్మగా గిరిజన రైతాంగం బాగాదెబ్బదిని తద్వారా ఘర్షణమొదలెందట.

ఈ పత్తిపంట సిద్ధాంతం ఏంచెప్తున్నది? గిరిజనరైతాంగం పడ్డబాధలకు ఎవరు కారణం? నైజాంసర్కారా? నైజాంసర్కార్ పత్తిపండించాలనుకోవడం ద్వారా అతనే గిరిజనులతోకోరి కలహం తెచ్చుకున్నాడనే ధ్వనివున్నది. భూస్వాములు నైజాంపిలిచి వేలంవేస్తే భూములు కొనుక్కున్నారు కనుక వాళ్ళను తప్పుపట్టాల్సిన పనిలేదు. కాని వాస్తవంగా భూస్వాములు తమ భూఆక్రమణలో అనుసరించిన క్రూరమైనదోపిడీ పద్ధతుల మాటేమిటి? గిరిజనరైతులు భూస్వాములతో పడ్డఘర్షణ మాటేమిటి?

ఇంకా బాలగోపాల్ తన వాదన కొనసాగిస్తూ "ఈరకంగా ఆసిఫాబాద్ ప్రాంతంలో (ఆదిలాబాద్ జిల్లా ఉత్తరభాగం) కొన్నివేల ఎకరాలను బ్రాహ్మణ, ముస్లిం, వెలమ భూస్వాములు చేజిక్కించుకున్నారు. వీళ్ళు వ్యవసాయదారులుకారు. దొరలు. దక్షిణాన కరీంనగర్‌ను ఆనుకొనివున్న లక్షెట్టిపేట దొరలుకొందరు ఇల్లు కదలకుండా ఈ భూములను కొనుక్కున్నారు. కాబట్టి కొనుకున్న భూములను సాగు చేయడంకోసం కాపు, మరాఠా, కున్బి తదితరకులాల రైతులను (ఆంధ్ర నుండి, మహారాష్ట్ర నుండి) రప్పించి, కౌలుదార్లుగా నియమించారు" అన్నారు.

నైజాంనవాబుకు ఎప్పుడూ కొత్తవ్యవసాయ పద్ధతులమీదగాని, కొత్తపంటల మీదగాని శ్రద్ధలేదు. కాని ఉన్నవనరులనుండి రెవెన్యూ రాబట్టుకోవడమే అతనికి కావలసింది. ఆదిలాబాద్ అడవుల్లోదొరికే కలప, గడ్డి, ఆకులు జిగురు, తదితర అడవి సంపదలమీదనే అతని కన్నంతా... ఆదిలాబాద్ గిరిజనులుచేసిన ప్రధాన పోరాటాలన్నీ అడవిఅధికార్లతోనే. గిరిజనులకు నాలుగైదేండ్లకొకమారు కొత్తభూమి కావాలి. కొత్తభూమికావాలంటే అడవినరకాలి. అడవినరికితే చట్టప్రకారం నేరం అంటారు ఫారెస్ట్ అధికారులు. 1920 కన్నముందు నైజాం నవాబుకు సుమారుగా ఒక్క ఆదిలాబాద్ అడవిమీద 15 లక్షల ఆదాయం ఉండేది.

ఆదిలాబాద్ గిరిజన ప్రాంతాలలోని భూమి భూస్వాములచేతుల్లోకి పోవడానికి ఏ పత్తిపంట కారణంకాదు. గిరిజనులు భూములు కోల్పోవడం అనేది బాలగోపాల్ ఊహించినట్టుగా ఎప్పుడో హఠాత్తుగా ఒకమారు జరిగింది కాదు దేశంలో ఎక్కడా ఇట్లాంటి పరిణామాలు జరిగినట్లుగా దాఖలాలులేవు.

భారతదేశంలో కొద్దితేడాలతో దాదాపు అన్నిప్రాంతాలలో రైతులు సాగుచేసుకునే భూములు భూస్వాములు ఆక్రమించడం ఒక్కలాగే ఉన్నది ఈ ఆక్రమణ వందల సంవత్సరాలుగా జరుగుతున్నది. ఈ సంవత్సరం అని ఖచ్చితంగా నిర్ణయించలేం గాని మైదానప్రాంతాలలో ఒత్తిడి పెరిగినాకొద్దీ మైదానప్రాంతాలనుండి జనం అరణ్యప్రాంతాలలోని విస్తారమైన సాగుభూములను ఆశించి తరలిపోవడం పరిపాటి అట్లాగే మైదానప్రాంతాలనుండీ చిల్లరవ్యాపారస్తులుకూడ అమాయక గిరిజనులను వాళ్ళ అమాయకత్వం ఆసరాగా దోపిడీచేయడానికి వీలుంటుందని తరలి వెళ్ళారు అట్లా ఆదిలాబాద్‌కు (దక్షిణంలోఉన్న కరీంనగర్, ఉత్తరంలోఉన్న మహారాష్ట్ర) మైదానప్రాంతాలనుండి మొదట వ్యాపార నిమిత్తం నైజాంకు వజారా

నాలు (కానుకలు సమర్పించి వడ్డీవ్యాపారులుగా గిరిజనప్రాంతాలకు వచ్చారు. మైదానప్రాంతాలలో భూములు పోగొట్టుకున్న పేదరైతులు గిరిజన ప్రాంతాలలోని భూములకోసం వచ్చారు. గిరిజనులను తెలివిగా దోపిడీ చేయగలిగినవాడు భూస్వామిగా రూపాంతరం చెందాడు. పేదరైతులు గిరిజనులలాగే అక్కడ దోపిడీకిగురై పేద రైతులుగానే మిగిలిపోయారు.

The land is mostly controlled by Andhra and Maharashtra Sahukars and traders who came as money lenders and became land owners (Undeclared Civil war, P. 20). ఈ విధంగా మహారాష్ట్ర, ఆంధ్రుల నుండి వచ్చిన షావుకార్లు, ఇతర వ్యాపారులు వడ్డీవ్యాపారులుగా స్థిరపడి మొత్తం భూమిని ఆక్రమించుకున్నట్లుగా ఢిల్లీ పి యు డి ఆర్ ప్రకటించిన పైపుస్తకంలో తెలిపారు. కాని బాలగోపాల్ ఊహించినట్లు భూస్వాములు పత్తిపంటకోసం నైజాం పిలిస్తే వచ్చినవాళ్ళుకాదు. భూస్వాములు ఆక్రమించుకున్న భూములు డబ్బుపెట్టి కొనుక్కున్నవి కానేకావు.

భూస్వాములు అంతపెద్దఎత్తున వేలఎకరాల భూములు ఆక్రమించుకోవడానికి నైజాం పరిపాలన, చట్టాలు బాగాతోడ్పడ్డాయి. అది ఏవిధంగా జరిగిందంటే, 1920 లో ఉట్నూరు తాలూకా కేంద్రంగా ఏర్పడింది. అంతకుముందు ఆదిలాబాద్ గిరిజన ప్రాంతాలలో శివాయి జమాబంది (కాస్తుచేసినదానికే పన్ను) అమల్లోవుండేది. ఈ రెవెన్యూఆదాయం స్థిరంగా ఉండేదికాదు. జమీందార్లు, సంస్థానాధిపతులు వసూలుచేసేదెంతోకాని ఇచ్చేదిమాత్రం నైజాంకు సంతృప్తిగా ఉండేదికాదు. తన ఏలుబడిలోఉన్న ప్రాంతంలో తనే అధికారులను నియమించి రెవెన్యూ వసూలు చేయించాలనుకున్నాడు. అప్పుడు రెవెన్యూ సెటిల్‌మెంట్‌కూడా అవసరమయింది. ఈ రెవెన్యూ గ్రామాలలో వసూలుచేయడానికి పాతజమీందార్ల దగ్గర అంతకిత్రం లెక్కలురాసిన పట్వార్లనే నియమించుకున్నాడు. రైతుసాగుచేస్తున్న భూమి వివరాలు సేకరించడానికి మొహిందార్ల (సర్వేయర్లు)ను నియమించాడు. ఈ మొహిందార్లు సాధారణంగా తురకలు. సర్వేయర్ల అనేక అవకతవక పనులట్లాఉంచి సర్వే విషయంలో ప్రధానంగా పట్వార్లమీదనే ఆధారపడ్డారు. ఫలితంగా దున్నేరైతుకు భూమి దక్కకుండా పోయింది. పట్వార్లు, దొరలే భూములమీద హక్కు చేజిక్కించుకున్నారు. దీనికి ఉదాహరణగా కరీంనగర్ ప్రాంతంనుండి వచ్చిన వెలమభూస్వామి మందమర్రి మాధవరావు ఒకఎద్దుతో వచ్చినవాడు దాదాపు పదహారు గ్రామాలలో పదివేల ఎకరాలదాక భూమి కబ్జాచేసుకున్నాడు.

వాస్తవం ఈవిధంగా ఉండగా హేమెన్‌డార్ఫ్, కావాలనే భూస్వాముల భూమి ఆక్రమణ గురించి ఇచ్చిన తప్పుడు సమాచారాన్ని ఆధారంగా చేసుకొని బాలగోపాల్ దాన్ని అతకడానికి పత్తిపంట సిద్ధాంతాన్ని తీసుకువచ్చారు.

ఇట్లా భూములుసంపాదించిన భూస్వాములు ముఖ్యంగా ఆసిఫాబాద్ ప్రాంతంలో ఎవరూ పత్తిపంటపండించిన దాఖలాలులేవు. నిజాం పత్తిపంటకోసమే భూస్వాములకు భూములు అమ్మితే భూస్వాములు పత్తి ఎందుకు పండించలేదు? అయితే ఆదిలాబాద్‌లో పత్తి పంటవేయడం వాస్తవమే. ఈ పత్తిపంట ముఖ్యంగా మహారాష్ట్ర సరిహద్దు తాలూకాలలో అప్పటికీ ఇప్పటికీపండిస్తారు. ఇది నైజాంతెచ్చిన పంటకాదు. బొంబాయి బట్టలమిల్లుల అభివృద్ధితో సహజంగానే మహారాష్ట్రలో పత్తిపంటపెరిగింది. అది లాభదాయకం కావడంతో భూస్వాములకన్న ధనికరైతులు, మధ్యతరగతిరైతులే ఈపత్తిపంటకు ఆకర్షితులైనారు. కనుక ఈపంట విషయంలో నైజాంకు జోక్యమేదీ లేదు. ఆదిలాబాద్ ఉత్తర దక్షిణప్రాంతాలకన్న పశ్చిమ ప్రాంతంలో ఎక్కువగా పత్తి పండించడం కనిపిస్తుంది. ఇక్కడకూడా గిరిజనులకన్న మైదానప్రాంతాలవారే పత్తిఎక్కువపండించారు.

ఇక భూస్వాములు మైదాన ప్రాంతాలనుండి గిరిజనప్రాంతాలలోకి రైతులను తీసుకొచ్చి భూమి కౌలుకు ఇచ్చారనేవిషయం, భూస్వాములు గిరిజనప్రాంతాలలో గిరిజనరైతులకే తమ ఆధీనంలోఉన్న భూములు కౌలుకు ఇచ్చారు. కౌలు చెల్లింపు విషయంలో భూస్వాములకు గిరిజనులేనయం. నయాన భయాన కౌలు వసూలు చేసుకోవచ్చు. మైదాన ప్రాంతాల రైతులతో వ్యవహారం గిరిజనులతో జరిపినంత సులువు కాదు. ఎప్పుడైనా సామూహికపలస ఆర్థికసంక్షోభాలు సంభవించినప్పుడు జరిగిందే గాని, ఎవరో ఒకరిద్దరి ఇచ్చినసురించి జరిగిందికాదు. పైగా ఈ గిరిజనప్రాంతాలలో శామం చేజిక్కించుకున్న వేలఎకరాల భూములను గిరిజన-గిరిజనేతర సమస్య లేకుండా దున్ని కౌలుగట్టిన ప్రతివాడికి కౌలుకివ్వడం కనిపిస్తుంది.

ఇట్లా బాలగోపాల్ పత్తిపంట సిద్ధాంతంకొనసాగించి గిరిజనులు లోతట్టు అరణ్యాలలోకిపోవడానికి ఈరకంగా భూములు కోల్పోవడమేకారణమని తీర్మానించారు కాని వాస్తవంగా గిరిజనులు లోతట్టుప్రాంతాలకు వెళ్ళడం రెవెన్యూ అధికపసూళ్ళు, భూస్వాముల, వడ్డీవ్యాపారుల దోపిడీదౌర్జన్యాలు, అడవిఅధికారుల దౌర్జన్యాలు, స్థిర వ్యవసాయంమీద ఇచ్ఛలేకపోవడం, సారవంతంకాని భూములు-ఈ అన్నికారణాల

చేత గిరిజనుడు భూమిమీద స్థిరమైన హక్కు పొందలేకపోయాడు. ఇట్లాంటి అన్ని రకాల కారణాలమూలంగా గిరిజనులు లోతట్టుకుకు ముడుచుకుపోయారు.

ఈచిక్కులన్నీ భూమిచుట్టూచేరి గిరిజనుణ్ని ఉక్కిరిబిక్కిరిచేశాయి. ఇట్లా వచ్చిన ప్రతిదోపిడీరూపానికి వ్యతిరేకంగా, తమ జీవనసరళికి అడ్డంవచ్చిన ప్రతి చర్యకు గిరిజనులు స్పందించారు, ప్రతిఘటించారు. ఎన్నిరూపాలలో గిరిజనుల ప్రతి ఘటన సాగినా ఆదిఅంతిమంగా భూమిచుట్టూ, అడవిచుట్టూతిరిగే పోరాటమే.

1858లో ఉట్నూరు తాలూకాలోని గోండులకు, ఇంగ్లీషువారికిమధ్య యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో దాదాపు 300 మంది గోండులు సంహరింపబడ్డారు. వాళ్ళకు నాయకత్వం వహించిన రాంజీగోండు నిర్మల్‌లో ఉరితీయబడ్డాడు. అప్పటినుండి ఇప్పటిదాకా ఆదిలాబాద్ గిరిజన ప్రాంతంలో గిరిజన తిరుగుబాట్లు జరుగుతూనే ఉన్నాయి.

కాని నాగరిక చరిత్రకారులెవ్వరూ ఈ విషయాలను రికార్డ్ చేయలేదు. నైజాం ప్రభుత్వం, నైజాంమీద అజమాయిషీ, పట్టుగలిగిన బ్రిటిష్ ప్రభుత్వం తమతమ అవసరాలమేరకు ఈ పోరాటాలను వక్రంగా చిత్రించడానికి ప్రయత్నం చేశాయి.

బాలగోపాల్ ఆదిలాబాద్ గిరిజనులుచేసిన ఈ భూపోరాటాలను తప్పుగాఅర్థం చేసుకున్నారు. అది హఠాత్తుగా జరిగిన పరిణామంగానూ, నైజాం పత్తి పంట వేయాలనే సంకల్పం మూలకంగా ఉత్పన్నమైనదిగానూ అర్థంచేసుకున్నారు. ఇట్లా బాలగోపాల్ పొరపాటు పడటానికి కారణం హేమెన్‌డార్ఫ్ తప్పుడునివేదికలే. హేమెన్‌డార్ఫ్ మానవతావాదిగా ముసుగేసుకొని రాసినరాతలను బాలగోపాల్ నమ్మడం జరిగింది. నైజాంనుగాని, భూస్వాములనుగాని ఖచ్చితంగా గిరిజన తిరుగుబాట్లకు కారణంగా ఎంచకపోవడం అప్పటి బ్రిటిష్‌వాళ్ళ రాజనీతి. అవసరమున్నంతమేరకు సామంతరాజులను దువ్వడం, భూస్వాములను మచ్చికచేసుకోవడం ఆనాటి బ్రిటిష్ సామ్రాజ్యవాదులకు అవసరమైంది. ఈ రాజనీతికి అనుగుణంగానే హేమెన్‌డార్ఫ్ నివేదికలున్నాయి హేమెన్‌డార్ఫ్‌నునమ్మి బాలగోపాల్ గిరిజనపోరాటాలను తక్కువగా చిత్రించడానికి లేదా తప్పుగా చిత్రించడానికి ప్రయత్నించారు.

ఇంకా భూస్వాముల భూఆక్రమణ పద్ధతులగురించి వివరణ కావాలనుకుంటే, నైజాంప్రభుత్వానికి సాలార్‌జంగ్ దివాన్‌గా ఉండగా (1860) సంస్థాన

యంత్రాంగంచేతనే ప్రత్యక్షంగా పన్నులు వసూలుచేసేపద్ధతి ప్రవేశపెట్టబడింది. అప్పుడు ఈ దేశ్‌ముఖ్‌లకు, దేశపాండేలకు గతంలో వారు వసూలుచేసిన పన్నుల మొత్తం ప్రాతిపదికపై పెన్షన్‌లు లేదా మాష్ (ఉద్యోగానంతర భృతి) మంజూరు చేయబడినాయి. ఈ దేశముఖ్‌లు, దేశపాండేలు పన్నులు వసూలుచేసే కాలంలో సాగులోఉన్న అతిసారవంతమైన భూముల్ని వేలాదిఎకరాలను కబళించారు. ఆ భూమిని తమస్వంతఆస్తిగా దఖలుపరచుకున్నారు. ఈ భూముల్ని సాగుచేసుకుంటున్న రైతులను చిత్తంవచ్చినపుడు తొలగించివేయడానికి వీలుగా కౌలుదార్లస్థితికి నెట్టబడ్డారు. (వీరతెలంగాణ విప్లవపోరాటం- గుణపాఠాలు- పి. సుందరయ్య)

అదేపుస్తకంలో "రైతులు సాగుచేసుకుంటున్న భూమిలో అధికభాగాన్ని మొట్టమొదలు సర్వేసెటిల్‌మెంట్ సందర్భంగా భూస్వాములు స్వంతంచేసుకున్నారు" అని రాశారు.

ఇంకా 1920-22, 1930-33 ప్రాంతాల్లో రెండు ప్రపంచయుద్ధాల అనంతరం ఏర్పడిన ఆర్థిక సంక్షోభాల సందర్భంగా గ్రామాలలో రైతులు భయంకరమైన కరువు పరిస్థితిని ఎదుర్కొన్నారు. ఈ కరువుల్లో రైతులు తమ ఆధీనంలో అప్పటికి ఉన్న భూములకు పన్నులు చెల్లించలేని హీనస్థితికూడ భూస్వాములు, మక్తేదార్లు, భూములను ఆక్రమించుకోవడానికి దోహదపడింది. మైదానప్రాంతాలలో రైతులు వందలు, వేలసంఖ్యలు వలసలుపోవడం, అనువైనస్థలంలో స్థిరపడడం దాదాపు అప్పుడే ఎక్కువగా జరిగింది.

ఇట్లా భూములు సంపాదించినవారు ఆదిలాబాదు గిరిజన ప్రాంతాలలో పస్పూరు సంస్థానం. మందపురి మాధవరావు. సిర్పూరు చావుస్ (అరబ్బు)లు, ఆసిఫాబాద్ బ్రాహ్మలు. నజరానాలు చెల్లించి గూడాలలోకి వచ్చిన వడ్డీ వ్యాపారులైన షావుకార్లు.

ఆదిలాబాద్ గిరిజన ప్రాంతాలలో భూమిసమస్య అంతిమంగా బాలగోపాల్ పేర్కొన్నట్లు ఏదో పాక్షికకారణంతో ముడిపడిలేదు. మొత్తం భారతదేశపు రైతాంగం భూములు కోల్పోవడం ఎట్లాజరిగిందో (భూస్వాముల, వడ్డీవ్యాపారుల క్రూరమైన దోపిడీ మూలంగా) అట్లాగే ఆదిలాబాద్ గిరిజన ప్రాంతాలలో గిరిజనులు భూములు కోల్పోయారు. ఇట్లా భూములు కోల్పోయిన గిరిజనులు తప్పనిసరైన పరిస్థితిలో

తిరుగుబాట్లు చేశారు. గిరిజనుల తిరుగుబాట్లకు గిరిజన ప్రాంతాలలో భూమిసమస్యతో ముడిపడిఉన్న ఇంకో ప్రధానసమస్య అడవిచట్టాలసమస్య.

1920 ప్రాంతంలో ఇంగ్లీషువాళ్ళు తమ ప్రత్యక్షపాలనకిందఉన్న ప్రాంతాల్లో అడవి సంరక్షణ పేర చట్టరీత్యా క్రమపద్ధతిలో అడవినుండి లాభం పిందుకోవడానికి అనేక అడవి చట్టాలను అమలులోకితెచ్చారు. అనేక సమస్యలతోపాటు ఈ అడవి చట్టాలసమస్యకూడ తోడయి 1922ప్రాంతంలో అల్లూరిసీతారామరాజు నాయకత్వంలో మధ్యతిరుగుబాటు జరిగింది.

నైజాంకు తన అధీనంలో ఉన్నప్రాంతాల్లో కూడ అడవిమీద ఇంతకుముందుకన్నా రెవెన్యూఎక్కువరాబట్టుకోవడానికిఇంగ్లీషువాళ్ళ అడవిచట్టాలు పనికివచ్చాయి. 1925-26 ప్రాంతంలో ఆదిలాబాద్ గిరిజనప్రాంతాలలో ఈ చట్టాలు అమలులోకివచ్చాయి. ఇప్పుడు గిరిజనుడు చెట్టునరకడం నేరమయింది. అంతేకాక గిరిజనులు సాగుచేసు కుంటున్న విస్తృత భూభాగాన్ని అధికారులు రిజర్వు ఫారెస్టుగా ప్రకటించేవారు. దీని మూలంగా గిరిజనులు దిక్కుతోచని స్థితిలోకి నెట్టబడ్డారు. అడవి అధికారులుచేసే దౌర్జన్యాలకు విసిగిపోయి లోతట్టు ప్రాంతాలకు తరలిపోయారు. ఒకటిరెండు సంవత్స రాలు గడిచిన తర్వాత నేలను సాగుయోగ్యం చేసినతర్వాత భూస్వాములు ఇది మా పట్టాలోది కౌలుఇవ్వండని తుపాకులతో బెదిరించేవారు, హింసించేవారు. ఈ విధంగా అడవి అధికారులు, భూస్వాములు తెస్తున్నఒత్తిడికి గిరిజనులు గిజగిజలాడిపోయారు. తిరగబడ్డారు. తరమబడ్డారు, చంపబడ్డారు.

కాని బాలగోపాల్ ఈ ఒత్తిడిని ఎత్తుకుంటూ "అయితే 1940ల నాటికి అడవుల సంరక్షణ చట్టాలు వాళ్ళ గ్రామానికేవచ్చాయి" అంటూ చట్టాలు హఠాత్తుగా వచ్చినట్టు ధ్వనిస్తున్నారు. ఈ మాట ఎందుకు వాడారంటే, అడవి చట్టాలు వచ్చాయిగనుక ఏదో భీము వాళ్ళకుటుంబం పెనుగులాడింది, పెనుగులాటలో భీము చనిపోయాడు అనే తనవాదనను సమర్థించుకోవడానికి, భీము నాయకత్వంలో జరిగిన బాబేఝరి పోరా టాన్ని తక్కువగాచిత్రించడానికి ఈ వాదన తోడ్పడుతుంది.

గిరిజన ప్రాంతాలలో అనేక వీరోచిత గిరిజనపోరాటాలు జరిగాయి. భీము కాలంవాటికి అవి ఒక రూపంతీసుకున్నాయి. దీనికి భీము జీవితం ఒక ఉదాహరణ. సంకెపల్లినుంచి బాబేఝరీ దాకా భీము, భీము కుటుంబం భూమికోసం ఎన్నోతిప్పలు పడ్డారు, తెగించిపోరాడారు. సుర్దాపూర్‌లో భూములు సాగుయోగ్యం చేసిన తర్వాత

తన పట్టాఅంటూవచ్చిన సిద్దిక్‌ను చంపేశారు. ఇది యాదృచ్ఛికమేకావచ్చు కాని ఘర్షణ జరగడం, భూస్వామిని ప్రతిఘటించడం కనిపిస్తుంది. భీము చిన్నాయన ఒకరు జీవితమంతా ఫారెస్టు అధికారులకు, భూస్వాములకు వ్యతిరేకంగా పోరాడాడు. ఏడుసార్లు అడవినరికి సాగుచేసిన భూమినుంచి తొలగించబడ్డాడు. ఇట్లా గ్రామ గ్రామాలలో బాధలుపడ్డగిరిజనులు 1939వరకు సంఘటితపడ్డారు. బాబేఝరి కేంద్రంగా భూములుచేసుకొని, బాబేఝరి, జోడెన్‌ఘాట్, మోవాడం, నర్సాపూర్, మురికిలొంక మొదలగు 12 గ్రామాల్ని రూపొందించుకున్నారు. రైతులు సంఘటితంగా ఏదొచ్చినా నిలబడాలనే తలంపుకువచ్చారు. ప్రభుత్వం గిరిజనుల సంఘటితశక్తిని గుర్తించి పెద్దఎత్తున దాడికి సిద్ధపడ్డది.

నిజానికి ఇట్లా 12 గ్రామాలు ఏర్పడడానికి భీము ప్రమేయమేమీలేదు. కాని ప్రభుత్వం కేసులు వగైరా పెట్టి దాడికి సిద్ధపడినప్పుడు, గిరిజనులు సంఘటితంగా ఎదుర్కోవాలనే ఆలోచనతో ఉన్నందువల్ల, భీము అప్పటికే నాలుగుప్రాంతాలు తిరిగి వచ్చినవాడనీ, ప్రపంచజ్ఞానం తమకన్న ఎక్కువతెలుసనీ ఎంచి చట్టపరమైన లీగల్‌పోరాటంలో తమకు అండగా ఉండగలడని తమవద్దకు పిలుచుకున్నారు. భీము వచ్చేదాక జరిగిన ఈ తతంగాన్ని బాలగోపాల్ ఇంచుమించు "ట"లతో చెప్పి. తర్వాత భీము నాయకత్వంలో దాదాపు ఏడు నెలలు నైజాంపోలీసులను ధిక్కరించి నడిపిన పోరాటాన్ని అదేదో మామూలుఘటనగాఎంచి కొట్టిపారేశారు.

బాబేఝరీ-జోడెన్‌ఘాట్ పోరాటాన్ని "ఈ సంఘటనవెనుక గిరిజనులలోని విస్తృతమైన అసంతృప్తి, అలజడి ఉన్నాయనేది స్పష్టమే. కాని దీనిని సంథాల్ పోరాటంతోనో లేక మన్యపోరాటంతోనో సమానమైన తీవ్రత, విస్తృతి, నిర్మాణం కలిగిన పోరాటంగా చెప్పవచ్చునాఅంటే అనుమానమే...." అంటూ హేమెన్‌డార్ఫ్ మెత్తమెత్తగా తిరస్కరించిన భావాన్నే బాలగోపాల్ మరోమాటల్లో చెప్పారు.

కొమురం భీము నాయకత్వంలో జరిగిన జోడెన్‌ఘాట్ పోరాటం ఒక పరిమిత ప్రాంతంలో జరిగినా, కుహనా మేధావులు రాసిన పుస్తకాల ఆధారంగాకాక వాస్తవ విషయాలమీద ఆధారపడి ఆలోచిస్తే అది నిస్సందేహంగా గిరిజన తిరుగుబాటే. ఈ సంగతి నిజాంప్రభుత్వపు రికార్డుల్లో స్పష్టంగాఉంది.

ఆదిలాబాద్ గిరిజనులగురించి కొందరు కార్యకర్తలు అప్పటిపోరాటంలో పాల్గొన్న గోండుల నుంచి సేకరించిన సమాచారం ఆధారంగా చెప్పాలంటే. భీము

జోడెన్ ఘాట్ వచ్చినపిదప తనకున్న అనుభవంతో అంతవరకు జరిగిన ఘరాపోరాటాన్ని అంచనా వేసుకున్నాడు. తన సహచరులతో కలిసి ఆసిఫాబాద్ కోర్టుకు వచ్చినసందర్భంలో సాలెపంతులలో, వకీలు రామచందర్ రావు పైకాజీతో మాట్లాడినప్పుడు అతను నైజాం సర్కారు రాజ్యపాలనగురించి చాలా విషయాలు తెలుసుకున్నాడు. తమసమస్యకు చట్ట పరంగా పరిష్కారం దొరకగలదని మొదట ఆశించాడు. తమ ప్రాంతంలోని అధికారుల దౌర్జన్యాలగురించి నైజాంరాజుకు చెప్పుకుంటే ఫలితముండగలదేమోనని నైజాంరాజును కలవడానికివెళ్ళి తమసమస్యలను ఏకరువు పెట్టాలనుకున్నాడు. హైదరాబాద్ వెళ్ళిన భీముకు నైజాంరాజు స్వభావంతెలిసింది.

ఆ తర్వాత సాయుధప్రతిఘటనకు పిలుపు ఇచ్చాడు. నైజాం క్రూరమైన పాలనను, అధికారాన్ని తిరస్కరిస్తున్నట్టుగా ప్రకటించాడు. భీముకు అప్పటికిగాని తాము తమ భూములమీద అధికారం అనుభవించాలంటే యుద్ధంచెయ్యక తప్పదని, అందుకు పరపీడనలేనిరాజ్యం ఉండాలని నిర్ణయంకలిగింది. భీము ఏర్పాటు చేయాలనుకున్న రాజ్యానికి సంబంధించిన ఈ భావనయే బాలగోపాల్ కుగాని, హేమెన్ డార్ఫ్ కుగాని ఏవగింపుగాతోచింది.

బహుశా తమ నాగరిక ఆలోచనలు, జీవితంవల్ల అడవిలోబతికే భీములాంటి ప్రజానాయకుని రాజ్యానికి సంబంధించిన ఆలోచన విభ్రాంతి కలిగించవచ్చు. గిరిజనులు అట్లా ఆలోచించడం సర్వసాధారణ విషయం. భీము తండ్రి గ్రామపటేల్ అప్పటినుండి ఇప్పటివరకు గిరిజనులకు తమ రాజ్యం అస్తిత్వంలోలేకున్నా రాజ్య భావనమాత్రం పోనేలేదు.

పరాయిపాలన, అడవిలో ఒకప్రాంతంనుండి ఇంకోప్రాంతానికి తరుమబడడం ఒకపక్క, ఇంకోపక్క వాళ్ళగోండు రాజ్యానికి సంబంధించిన భావన-భీముకు గోండు రాజ్యస్థాపన చేయాలనే ఆలోచనకు మూలకారణాలు. అయితే మార్క్సిస్టులు చెప్పే సూత్రబద్ధమైన 'రాజ్యాధికారం' కాకపోవచ్చు. అతను అచ్చంగా ఇంతకు పూర్వంలాంటి గోండురాజ్యాన్ని ఏర్పాటు చేయాలనుకోలేదు. ముఖాసీలతోగాని, గోండురాజులతోగాని మాట్లాడినప్పుడు భీము రాజ్యానికి సంబంధించిన కొన్ని భావాలు వెలిబుచ్చాడు. గిరిజనులకు రాజ్యానికి సంబంధించిన ఆలోచనలు ఉంటాయనడానికి చాలా ఉదాహరణలు చెప్పవచ్చు, ఇప్పటికీ బరి రాజు విశ్వేశ్వరరావు గోండు రాజ్యానికి సంబంధించినకలలు కంటూనే ఉన్నాడు. అయితే విశ్వేశ్వరరావు

రాజ్యానికీ, భీము కలలుగన్నరాజ్యానికి చాలతేడాలున్నాయి. ఇంకొక ఉదాహరణ పెద్దిశంకర్ ఎన్‌కౌంటర్ గురించి వెళ్ళిన ఫాక్ట్‌ఫైడింగ్ కమిటీలోని ఒకసభ్యుడు మొయిన్‌బిన్ పేటలో ఒకగోండును మీపెద్దెవరు అని అడగగా "మారాజు విశ్వేశ్వర రావు" అని చెప్పినట్లుగా ఆసభ్యుడు నాకుచెప్పాడు.

అయితే "రైతాంగపోరాటాలకు చిల్లరజమీందార్లు, జమీందార్లు కాగోరేవారు, కొన్ని సందర్భాలలో స్థానిక సంస్థానాధీశులు నాయకత్వం వహించి రైతాంగం రక్తంతో జాగీర్లు కొనుక్కోవడం మనదేశచరిత్రలో అసాధారణ విషయంకాదు". ఇదినిజమే. అయినా మైదానప్రాంతాలలో చెలరేగిన రైతాంగ తిరుగుబాట్లకు, గిరిజన ప్రాంతాలలో జరిగిన రైతాంగ తిరుగుబాట్లకు ఇక్కడ తేడా స్పష్టంగానే కనిపిస్తుంది. గతంలో జరిగిన గిరిజన తిరుగుబాటు నాయకులకు మైదాన ప్రాంతాలలోని రైతాంగనాయకులకు తేడాఉన్నది. స్వంతఆస్తికి సంబంధించిన భావనగల నాయకులెవరూ గిరిజన రైతాంగ తిరుగుబాట్లకు ఎక్కడా నాయకత్వం వహించిన దాఖలాలు భారతదేశంలోలేవు.

కనుక భీము సంస్థానాధీశుల్లాగా గిరిజనులరక్తం పణంగాపెట్టి జాగీరు కొనుక్కోవడమో లేక సామంతరాజు కావాలనుకోవడమో చేశాడనేది ప్రభుత్వఅధికారి లాంటి అబ్దుల్‌సత్తార్ అనడంలో అతనికి రాజ్యానికి సంబంధించిన ఫ్యూడల్ అవగాహనే కారణం. కాని అసలే అలాంటిఆలోచన లేదనేది పెటీబూర్జువా ఆలోచనే. కాని భీముకు తమభూములమీద తమకే హక్కుండాలని, అందరినీ సమంగాచూసే న్యాయంకావాలని, పీడన, దోపిడీ, దౌర్జన్యంలేని రాజ్యంకావాలనే ఆలోచన తప్పకుండా ఉన్నది. భీముదగ్గర వార్తాహరుడిగా పనిచేసి, ఇప్పటికీ బతికిఉన్న కొమురం సూరు చెప్పిన విషయాలనుబట్టిగాని, అప్పుడు నైజాంసర్కారుతో రాయబారంకోసం పంపబడిన సబ్-కలెక్టర్ముందు భీము తాముకోరే రాజ్యంగురించి చెప్పినమాటలు ఇప్పుడు లిఖితరూపంలో ఎక్కడాలేవుగాని, ఇప్పటికీ గిరిజనులు తమనోళ్ళలో భద్రంగా దాచిన, భీముకోరిన రాజ్యానికి మానిఫెస్టో అనదగిన పాటను పరిశీలిస్తే మనకు స్పష్టంగానే అర్థమవుతుంది.

కొమురంభీముకు బోలోరె కోయదాదా
భూమిభూటో కసిపాటి (భూమి భుక్తి గుడ్డకొరకు)
మరట్ నడింగ్ దోహమదోయ్ (మనమేనడుంగట్టాలె)

బుడగపేసి లడాయితుంగానా (కట్టెపట్టి యుద్ధంచెయ్య)

.... .... .... .... .... ....

గోండు రాజ్యం తరానా (గోండురాజ్యం తేవాలె)

(ఈ పాట పూర్తిపాఠం 'కొమురం భీం' నవలలోఉంది)

ఇక భీము నాయకత్వంలో జరిగిన పోరాటపరిధి, విస్తృతి, నిర్మాణాల విషయానికి వస్తే, యుద్ధంచేసేవాడు ఏ నిర్మాణంలేకుండా అల్లాటప్పాగా యుద్ధంచెయ్యడనేది బాలగోపాల్‌లాంటివారికి తట్టకపోవడం ఆశ్చర్యమే. సూరుచెప్పిన సమాచారాన్ని బట్టి, దాదాపుఏడునెలలు పటారుమీదఉండి నైజాంపోలీసులను ప్రతిఘటించినట్లుగా అర్థమవుతుంది. సూరుసంగతట్లాఉంచి, డాక్టర్‌తోసహా 99 మంది సాయుధులైన సైనికులతో భీము వాళ్ళమీదికి నైజాం అధికారులు ఎందుకు పోయినట్టు?

అప్పుడు ఆ ఘటనలో పాల్గొన్న ఒకఅధికారి ప్రభుత్వానికి ఇచ్చిన రహస్య నివేదిక ప్రకారం 500 మంది గోండ్లు గుట్టమీద సాయుధులైఉండడం, అక్కడ యుద్ధవాతావరణం ఉండడం, వాళ్ళచేతులలో సాంప్రదాయక ఆయుధాలైన గొడ్డలి, ఈటె, బరిశె, బల్లెం, బాణంలాంటివేకాక నాటుతుపాకులు ఉన్నట్టురాశాడు. బాలగోపాల్ ఈ రిపోర్టును ప్రకటనకిచ్చినట్టుగా భావించారు ఇది ఆ అధికారి ప్రభుత్వానికి పంపిన రహస్యరిపోర్టు మాత్రమే. ఈ అధికారి అబద్ధాలురాసాడనుకున్నా తుపాకిపట్టడానికి అడవిలో గిరిజనుడు సంసిద్ధుడయ్యాడంటే నిర్మాణం, విస్తృతి లేకుండా ఎట్లాసాధ్యం? (ఇప్పటికీ ఆదిలాబాద్ గిరిజనులకు తుపాకుల తయారీ, వాడకం కొత్తకాదనేవిషయం నేటిప్రభుత్వానికికూడాతెలుసు.

సూరు చెప్పినదాన్నిబట్టి వాళ్ళు గెరిల్లా పోరాటపద్ధతిని అనుసరించారు. గుట్టల మీద కాపలాలు పెట్టారు. తమఆశయాన్ని ప్రజలకు చెప్పడానికి ప్రచారదళాలను (గొంగడోళ్ళ పేరుతో) నిర్వహించారు. చంద్రవంకకలిగిన ఎర్రజెండా ఎగరవేయడం, సమాచారం అందించడానికి, సేకరించడానికి వేగులను నియమించుకోవడం, ప్రజలను సమీకరించడానికి కాలికొమ్ము (తూటుకొమ్ము) ఊదడం, తుడుంమోగించడంలాంటివి ఏ నిర్మాణంలేకుండా జరిగేవేనా?

ఏదైనా ఒకపోరాటాన్ని అంచనావేయడానికి జయాపజలమీద కాకుండా అది నిర్వహించబడిన తీరుమీద ఆధారపడితే సరైన నిర్ణయాలు చేయగలుగుతామని బాలగోపాల్‌కు చెప్పవలసిన పనిలేదనుకుంటాను.

కనుక మొత్తంగాచూస్తే కొమురంభీము నాయకత్వంలో జరిగిన జోడెన్‌ఘాట్ గిరిజన తిరుగుబాటు భారతదేశంలో ప్రజాస్వామిక విప్లవంలో భాగంగా జరిగినఅన్ని గిరిజన తిరుగుబాట్లలాంటిదేనని గుర్తించకతప్పదు. అది చిల్లరమల్లర ఘటనగా కొట్టి పారేయడానికి అనేక ఉదాహరణలుతెచ్చి బాలగోపాల్ చాలశ్రమపడ్డారు.

ఇక హేమెన్‌డార్ఫ్‌పట్ల బాలగోపాల్ భ్రమలకుసంబంధించి, హేమెన్‌డార్ఫ్ 1941 తర్వాత, అంటే జోడెన్‌ఘాట్ తిరుగుబాటు తర్వాత గిరిజనుల స్థితిగతులు విచారించి అవసరమైతే పశుబలాన్ని ఉపయోగించిగాని, లేదా వాళ్ళసంస్కృతిని దెబ్బదీయడంద్వారాగాని గిరిజనుల పోరాటాన్ని పక్కదారిపట్టించాలనే బ్రిటిష్ సామ్రాజ్యవాదుల కుట్రలో భాగంగా మానవతావాదముసుగులో గిరిజనగూడాల్లో వెలిశాడు. ఇప్పటికీ హరిజన గిరిజన ప్రాంతాలలో సామ్రాజ్యవాదుల ఏజంట్లు మిషనరీలుపెట్టి సామ్రాజ్యవాద సంస్కృతిని వ్యాప్తిచేయడం బాలగ్‌పాల్‌కు తెలియదా? కొంతమంది ప్రచురిస్తున్న విప్లవసాహిత్యానికి జర్మన్ సంఘసేవక సంస్థలు పెట్టుబడులు పెట్టడంతో బాలగోపాల్‌లాగే చాలమంది విప్లవాభిమానులు పొరపాటు పడుతున్నారు.

1948లో తిర్యానికేంద్రంగా పనిచేసిన అప్పటి కమ్యూనిస్టులు హేమెన్‌డార్ఫ్‌ను సరిగానే అంచనావేసి, ఆ భావజాలానికి వ్యతిరేకంగా పోరాటం చేయవలసి వచ్చిందని చెపుతూ "గోండులు, కోయలు, మొదలగు ఆటవికతెగలకు చెందిన ప్రజల స్థితిగతుల్నిగూర్చి విచారించి తీసుకోవలసిన చర్యలను సూచించవలసిందిగా ప్రభుత్వంచే పంపబడిన హేమెన్‌డార్ఫ్ తన సాంఘిక, ఆర్థికచిట్కాలద్వారా కోయ ప్రజల్ని జోకొట్టడానికి చేసిన ప్రయత్నాలను పార్టీ వమ్ముచేయగలిగింది" అని సుందరయ్య రాశారు. (వీరతెలంగాణా విప్లవ పోరాటం - గుణపాఠాలు.)

ఇలాంటి హేమెన్‌డార్ఫ్ 1981లో ఇంద్రవెల్లి ఘటనకన్నముందు ఇందిరా కాంగ్రెస్ ప్రభుత్వంచే పిలువబడి తమ అమూల్య సలహా సహకారాలు అందించిన పిదపనే ఇంద్రవెల్లిలో ఇందిరాప్రభుత్వం అనేకమంది గిరిజనులను కాల్చిచంపింది. ఈ సంగతి బాలగోపాల్‌కు తెలియదా?

"ఆయన సంస్కరణవాదే అయినా. ఇవాళ్టి మార్క్సిస్టు బిరుదాంచితులైన సామాజిక శాస్త్రవేత్తలలాగకాక తాను పరిశోధించే ప్రజలజీవితాన్నీ, కష్టనష్టాలనూ పంచుకోవాలనీ, వాళ్ళకోసం చేయగలిగింది చేయాలనీ నమ్మినవ్యక్తి"అని బాలగోపాల్ వ్యాఖ్యానించారు. వాళ్ళ జీవితంతో కలగలిసిపోయి, వాళ్ళకష్టనష్టాల్లో పాలు

పంచుకొని వాళ్ళకోసం పాణాల్ని పణంగాపెడుతున్న మార్క్సిస్టులు (మార్క్సిస్టు-లెనినిస్టులుతప్ప గిరిజనుల జీవితంగురించి పట్టించుకున్నవాళ్ళు ఈనాడైతే వేరే ఏ బిరుదాంచితులులేరు) రాసినదానికన్నా హేమెన్‌డార్ఫ్ రాసిన చెత్త నమ్మదగిందా? మళ్ళీఇక్కడా అదేమాట. "భీముకు గోండురాజ్యం ఏర్పరచాలన్న పదంతి నిస్సం దేహంగా అతిశయోక్తి"- భీముకు హేమెన్‌డార్ఫ్‌కు తెలిసిన రాజ్యకాంక్ష లేక పోవడం వాస్తవమే. భీముకుగాని, భీమువెనుకనున్న పజలకుగాని వాళ్ళమీద దోపిడీ పీడనలేని రాజ్యంఉండడం అవసరం. అది పభుత్వం గుర్తించింది కను కనే అంతపెద్దఎత్తున దాడిచేసింది.

ఆ తర్వాత పభుత్వ కుటిలనీతిని చెప్తానే హేమెన్‌డార్ఫ్‌లాంటి పహృద యుల సహకారంతో ఎన్నోసంస్కరణలు పవేశపెట్టిందని కొంతసంతృప్తిని పక టించడంద్వారా పభుత్వ సంస్కరణ భ్రమలలో బాలగోపాల్ పడడం విచారకరం. గిరిజనగూడాలలో పభుత్వసంస్కరణ మాయజాలం అసలుఉద్దేశమేమిటో ఉదయన్ మిశా మాటలలో చెప్పాలంటే "నాగాలాండ్‌లో, మిజోరాంలో బ్రిటిష్ సామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగా గిరిజనులు తిరుగుబాటు చేసినపుడు, గ్రామాల పునర్నిర్మాణం పేర, గిరిజనులకు విద్య, వైద్యంపేర మిషనరీలు పెట్టారు. దీనివల్ల నాగాలు చెప్ప రాని బాధలుపడ్డారు. ముఖ్యంగా నాగా గిరిజన జీవితానికి పాణపదమైన గ్రామ వ్యవస్థ ధ్వంసమైంది". (జాతులసమస్య - మద్రాస్ సెమినార్ పేపర్)

ఇప్పుడు ఆదిలాబాద్‌లో గోండులకు సహాయంపేర, రోడ్లువేయడం, ఆశ్రమ పాఠశాలలు నిర్మించడం, ఇళ్ళస్థలాలు రోడ్లపక్కన ఇవ్వడం గోండుగ్రామీణ వ్యవ స్థను విచ్ఛిన్నంచేసి తద్వారా వాళ్ళకోసం పనిచేసే పౌరకలసార్లను వాళ్ళనుంచి వేరుచేయాలనే సైనికపరమైన కుటలోభాగమే. హేమెన్‌డార్ఫ్ సలహాలతో నైజాం పెట్టిన బడులు, గుడులుకూడ అలాంటికుటే.

హైదరాబాద్‌లో హేమెన్‌డార్ఫ్ "ఏదైనా చర్యతీసుకోకపోతే ఆదిలాబాద్‌లో అస్సాంలాంటి పరిస్థితి ఏర్పడే పమాదముంది" అనడంలో ఎలాంటి చర్యలు తీసు కోవాలో అడిగితే ఆయనేచెప్పేవాడు. పాతసంస్కరణల గురించి, గిరిజనులను ఆకుకు అందకుండా, పోకకుపొందకుండా చేయడం గురించి:

"కొందరు చేతుల్లోకి కంకరరాళ్ళు తీసుకున్నారు. అంతమాత్రానికే పోలీసు లకు పాణభయంవేసి, పోలీసులు వ్యాన్లలోనుండి, జీపుల్లోనుండి కాల్పులుజరి పారు"అంటూ బాలగోపాల్ ఇంద్రవెల్లి ఘటనను వివరించడంలో అదేదో యాదృ

చ్ఛిక ఘటనలాగా ధ్వనిఉంది. నిజంగా అలాంటి అభిప్రాయం బాలగోపాల్‌కు కలిగి ఉంటే అది తప్పుడు అవగాహనఅని చెప్పకతప్పదు భారతదేశంలో జరిగిన గిరిజన తిరుగుబాట్లనుండి సామ్రాజ్యవాదులు, వాళ్ళతర్వాత అధికారంలోకిమారిన అర్థవలస, అర్థభూస్వామ్య పాలకవర్గాలు గుణపాఠం తీసుకున్నారు. గిరిజనులు ఓటమిని, విజయాన్ని మైదానప్రాంత ప్రజలలాగ కాకుండా కొంతబలంగానే తీసుకుంటారు అందుకే ఇంద్రవెల్లికి దాదాపు 500 మంది సాయుధ పోలీసులను నమీకరించి, మరో శ్రీకాకుళం కాబోతుంది. అంటూ పేపర్లలో ఊదరగొడుతూ పథకంమీద కాల్పులు జరిపి ప్రభుత్వం గిరిజనులను భయకంపితుల్ని చేసింది. అయితే బాలగోపాలే చెప్పినట్లు ఇవాల్టిగోండ్లు హేమెన్‌డార్ఫ్ గోండ్లుకారు.

మొత్తంగాచూస్తే బాలగోపాల్ తమకున్న పుస్తకపరిజ్ఞానంతో, ముందే ఏర్పరచుకున్న తప్పుడు అభిప్రాయాలతో వాస్తవాలను పట్టించుకోకుండా, ఆదిలాబాద్ గిరిజనుల గురించి సమాచారంసేకరించి, కొద్దోగొప్పో రచనలుచేసిన వాళ్ళను విప్లవ రొమాంటిసిస్టులని, మార్క్సిస్టు విరుదాంచితులని అపహాస్యం చేయడానికి ప్రయత్నం చేశారు. తనుఆధారపడ్డ తారీఖులు, దస్తావేజులు, సంస్కరణవాదులు. సామ్రాజ్యవాద ఏజెంట్లు. నైజాంప్రభుత్వ అధికారులు రాసినవాటిని ఆ ధా రం చేసుకొని పత్తిపంట ఆర్థికవాదంలోపడి 'ఆదిలాబాద్ గిరిజన పోరాటాలు' వ్యాసం రాశాడు ఈ వ్యాసంలో పోరాటంలేదు సరిగదా, పోరాడిన గిరిజనుల పాత్రను తక్కువచేసి చూడటం మాత్రమే ఉన్నది.

అంతిమంగా చరిత్ర గతిక్రమాన్ని ప్రజలు మార్చగలరన్న వాస్తవసత్యాన్ని నిరాకరించారు.

ఈ వాదన బాలగోపాల్ కొత్తగాచేస్తున్నదికాదు. ప్రజాస్వామిక విప్లవపోరాటంలో భాగంగా ప్రజలుచేసిన వీరోచిత పోరాటాలను నాగరిక మేధావులు ఎలా వ్యాఖ్యానించారో. హేమెన్‌డార్ఫ్ భ్రమలోపడి బాలగోపాల్ ఆదిలాబాద్‌లో జరిగిన జోడెన్‌ఘాట్ పోరాటాన్ని భీము నాయకత్వాన్ని అలాగే వ్యాఖ్యానించారు.

అనేక పద్ధతులద్వారా భూస్వాములు, ఇటుకొత్తచట్టాలద్వారా వాళ్ళకొమ్ముకాసే ప్రభుత్వం గిరిజనభూముల్ని గుంజుకొని వాళ్ళజీవనసరళికి విఘాతం కలిగించినందువల్లనే భారతదేశమంతటా గిరిజనపోరాటాలు ఉధృతమై ప్రజాస్వామిక విప్లవంలో భాగంగానే కొనసాగాయి. సంతాల్, మన్యపోరాటాలలాగనే ఆదిలాబాద్ జిల్లాలో కొమురంభీం నాయకత్వంలో గోండుప్రజలు ఇలాంటి పోరాటాల్ని ముందుకు తీసుకుపోవడానికి ప్రయత్నంచేశారు.

# నిత్యసత్య శోధకుడు

కొడవటిగంటి ఇంచుమించు అర్ధ శతాబ్దంపాటు తమ రచనావ్యాసంగంతో తెలుగు సాహితీ ప్రపంచాన్ని ప్రభావితంచేసారు. వందలకొద్దీ కథలు, వ్యాసాలు, గల్పికలు, అనేక నవలలు, నాటకాలు, నాటికలు రాసారాయన. సంగీతం ఆయన అభిమానవిషయాల్లో ఒకటి. అలాగే సినిమా. ఇవి ఇలాఉంచగా జీవితంలోనూ సాహిత్యంలోనూ శాస్త్రీయదృక్పథాన్నీ అభ్యుదయ మార్గాన్నీ నిర్విరామంగా ప్రచారం చేసిన వీరుడు కొడవటిగంటి. తెలుగువారి సాంస్కృతిక జీవితంలో కొడవటిగంటిది నిర్దిష్టమైన స్థానం. ఆయనపై వెలువరించిన వ్యాసాల సంపుటి "భావవిప్లవకారుడు కొడవటిగంటి సాహిత్య సమాలోచన".

కె.వి.ఆర్ పరిచయవ్యాసం, 'ప్రగతిసాహితి' వివరణావ్యాసంకాక ఈ పుస్తకాన్ని మూడుఅంశాలుగా విభజించారు: వివేచన, రచన, సాహిత్యజీవితం.

"ప్రగతి సాహితి" సంపాదక వివరణలో "బహుముఖ రచయిత అయిన కుటుంబరావు కార్తవీర్యార్జునుడని చెప్పటంకాక, ఆయన రచనలు పాఠకునిలోఏర్పరచ బూనే దృక్పథాన్ని గణించాలన్నదే" తమ ప్రయత్నమని సంపాదకుడు చెప్పాడు. కొడవటిగంటి సాహిత్య, సాంస్కృతిక సమాలోచనలన్నింటా ఇదేకీలకాంశం. శిల్పం, లాలిత్యం, శైలి, శయ్య,వగైరావగైరాలను కొడవటిగంటి రచనల్లో పట్టుకోవచ్చు. పొగడవచ్చు. తెగడవచ్చు. కాని మిత్రులుకాని, వ్యతిరేకులుకాని కొడవటిగంటితో ఏకీభవించేది. లేదా విభేదించేదీ ఆయన దృక్పథంతోనే. ఇదేమాట త్రిపురనేని మధుసూదనరావు "కొ.కు. అభిప్రాయాన్ని ఆమోదించేవాళ్లే ఆయన సాహిత్యాన్నికూడ ఆమోదించారు" అని స్పష్టంచేసాడు.

వివేచనభాగంలో త్రిపురనేని మధుసూదనరావు ఒక అంశాన్నీ, వరవరరావు మరోఅంశాన్నీ ఫోకస్‌లోకి తీసుకువచ్చారు. "మన బూర్జువా సంస్కృతి ఫ్యూడల్ సాంకర్యం కలిగినది. ఫ్యూడల్ సంస్కృతిని నిర్మూలించి పైకివచ్చిందికాదు. దాంతో చేతులుకలిపి రాజీపడినది" అన్న కొ.కు. సూత్రీకరణ త్రిపురనేని మధుసూదనరావు ను ఆకర్షించింది.

అలాగే వరవరరావు తన వ్యాసంలో మరోసూత్రీకరణ- గమనించదగ్గది- చేసాడు. స్థూలంగా "ప్రతిరచయితా తనకర్తవ్యమేమిటో అన్వేషిస్తాడు. ఆ అన్వేషణకొక సమాధానం దొరికినతర్వాత- ఆ సమాధానాన్ని పరిపుష్టంచేయడానికే, ఆ సమాధానాన్ని ప్రచారంచేయడానికే తనరచనలూ, శిల్పమూ, తార్కికతా- ఉపయో

గిస్తాడు". ఈ "సత్యసాక్షాత్కారం" పొందిన మరుక్షణం శిల్పం, శైలి మొదలైన నాజూకు గొడవలన్నీ చివరిపెంచీలోకి వెళ్ళిపోతాయి. (ఈ మాటలు పరిపూర్ణరావువి కాదు. తాత్పర్యం మాత్రమే) ఇదెందుకు చెప్పాడంటే కొడవటిగంటికి 1950 ల వరకూ, వ్యాసాలూగట్రా రాసినా, నవలలూ కథలూలాంటి 'సృజనాత్మక' ప్రక్రియలే ముఖ్యమైన రచనా వ్యాసాంగం. నెమ్మదిగా కథలూ, గల్పికలూ తగ్గిపోయినాయి. వ్యాసాలు - ముఖ్యంగా సమాజం, చరిత్ర, మానుషశాస్త్రం ( Anthropology ) సంబంధించినవి - పెరిగిపోయాయి. ఇది కొడవటిగంటికి సమాజంపట్ల ఉన్న బాధ్యతవలనా తనకర్తవ్యంపట్ల ఉన్న నిజాయితీవలనా జరిగింది. దాన్నే కమిట్‌మెంట్ అనొచ్చు. అలా అయినప్పుడు "నేను కవిత్వానికి కమిట్ అయినవాణ్ణి" అని చెప్పడంలో ఎంత "తెచ్చికోలు గంభీరభావం" ఉందో అర్థమౌతుంది. అదేవ్యాసంలో అంత వివరించని మరోసంగతుంది. కొడవటిగంటికి "తనకున్నసామర్థ్యం" తెలుసు అనేది. ఈ విషయం కొంచెంపొడిగిస్తే బాగుండేది. అయితే అది స్థలంకాదని మానేసిఉండొచ్చు. చాలామందిరచయితలు తారాజువ్వల్లాగా పైకివచ్చి, అంతకంటె త్వరగా ఆరిపోయి రాలిపోతుంటారు. అందు క్కారణాలు ఇలాచెప్పుకోవచ్చు. (1) తమసామర్థ్యాన్నిగురించిన అంచనా (2) తాము చేపట్టేరచనాప్రక్రియ తేల్చుకోలేనిస్థితి (3) అధ్యయనం-అంటే పుస్తకాలనేకాదు, జీవితాన్నైనాసరే-చేయకపోవడం. వీటన్నింటికంటే ముఖ్యంగా తాను రచన ఎందుకు చేస్తున్నాడో లేదా ఎందుకు చేయాలో అనే విషయంపై అవగాహన అధికారం లేక పోవడం మౌలికకారణం. (ఏదోకీర్తికోసమో, సంపాదనకోసమో అయితే సమాజానికీ, అతడూ, అతనికీ సమాజమూకల్గించే ఇబ్బంది కొంతకాలమే) ఆపైన రచనాప్రక్రియ విషయంలోనే ఇబ్బంది. ఒకప్పుడైతే కవిత్వానికి ప్రాచుర్యంఉండేది, గ్లామర్ కూడా. అందుకని పట్టుమనిపదివాక్యాలు రాయలేనివాడుకూడా తొలిదాడి కవిత్వం మీదేచేసే వాడు. ఇటీవల నవలలకు ఆ గిరాకీవచ్చింది. చాలామంది మంచిరచయితలుగా గణన కెక్కవలసిఉండీకూడా ఈ ప్రలోభంవల్ల ప్రచారం పొందగలమని ఊహించి కవిత్వాన్నో, నవలనో తమ ప్రక్రియగాఎన్నుకొని విఫలమై ఎందుకూకొరగాకుండా పోయారు. బాధ్యతగల రచయితఎవరైనా ఇలాంటి ప్రలోభానికి లోబడరు. అందుకే వారికి సాహిత్యచరిత్రలో స్థానముంటుంది. కొడవటిగంటి జరుగుతున్న చరిత్రలో ఉదయించేసందేహాలను బహిరంగంగా చర్చించారు. ఆ చర్చను కొనసాగించవలసిన బాధ్యత ఆలోచనాపరులందరిది; ముఖ్యంగా మార్క్సిస్టులది. 'రచనంటే కమ్యూనికేషన్' అనే భావానికి సిసలైనప్రతినిధి కొడవటిగంటి.

కొడవటిగంటి కథలపై శ్రీపతి, నవలలపై కెవిఆర్ సుదీర్ఘమైన "సింహావలోకనం"లు చేసారు. శ్రీపతి కొడవటిగంటి కథలలో తొలినాటినుంచి అభ్యుదయ సామాజిక దృక్పథం గట్టిపునాదులమీద స్థిరపడిందని అభిప్రాయపడ్డారు. అంతకంటె కొడవటిగంటి కథలన్నీ ఒకరకమైన శోధననాళికలు (Test Tubes) గా కనబడతాయి అనిచెప్పటం మరింత వాస్తవం. ఆయనకథల్లో వివాహవ్యవస్థ ముఖ్యమైన వస్తువుల్లో ఒకటి. ఇంచుమించుగా మధ్యతరగతి నగరవాసుల వివాహసమస్యలన్నీ ఆయన కథల్లో చర్చించబడ్డాయి. సాంప్రదాయిక వివాహాలనుంచి సౌకర్యార్థం పెళ్ళిళ్లకు పరిణమించిన సామాజికతరిత్రి ఆయనకథల్లో గ్రాఫిక్‌గా చూడవచ్చును. ఆయన కథల్లో పాతకాలపు చాదస్తాలను, సంప్రదాయాలను ఎద్దేవా చేయడం తరచుగా కనబడుతుంది. మధురవాణి సౌజన్యారావు పంతుల్ని గిరికీలుకొట్టించినట్టుగా పాతకాలపు మనుషుల్ని ఉక్కిబిక్కిరిచేసాడాయన.

ఒకనాటికి తెలుగుసాహిత్యంలో వివాహవ్యవస్థగురించి ఎవరైనా సమగ్రంగా రీసెర్చి చెయ్యాలనుకుంటే ఒక్క కొడవటిగంటి సాహిత్యం సరిపోతుందనిపిస్తుంది. కె వి ఆర్ తనవ్యాసంలో 1939నాటి త్రివేణిలోపడిన శ్రీశ్రీ వ్యాసం "తెలుగులో కొందరు కథారచయితలు" (Some short story writers in Telugu) ప్రస్తావన తెచ్చారు. అందులో కొడవటిగంటిని మంచిరచయితగా ప్రస్తుతిస్తూనే ఆయనమీద చలం ప్రభావమున్నట్టు సూచించాడు శ్రీశ్రీ. ఆ ప్రభావం లేదని కె వి ఆర్ అంటారు. అయితే ఆసందర్భంలో చలానికి ఈసమాజంపట్లా, కొందరువ్యక్తులపట్లా అసహనం కొండొకచో ద్వేషం ఉందని. కొడవటిగంటి తొలికథల్లో ఈ అసహనం చూడగలం అంతే. కాని కె వి ఆర్ వ్యాసంలో కొడవటిగంటి నవలలకూ సమకాలీన సమాజ స్వరూపానికీ ఎంతటి సాన్నిహిత్యముందో సుదీర్ఘంగా చర్చించాడు. "సర్వసాధారణ విషయాలను రసగామార్చడంలో" కొడవంటిగంటిని సోమర్సెట్ మామ్‌తో పోల్చారు. మామ్ ప్రపంచంకంటె కొడవటిగంటిది విశాలమైనది. ఆర్థికమాంద్యపు రోజుల్నించి రెండోప్రపంచయుద్ధంవరకు తెలుగుసామాజిక చరిత్రను-మధ్యతరగతికి సంబంధించి సంతవరకు-కొడవటిగంటి నవలల్లోచూడొచ్చు. నగర మధ్యతరగతిప్రజల జీవితంమీద కొడవంటిగంటి అథారిటీ ఇదేవిషయాన్ని పలువురు రచయితలు వ్యక్తంచేసారు. కల్పనకూ కొడవటిగంటికీ చుక్కెదురు. ఆయన వాస్తవికత మెరుగులాయికాదు, చూపుడువేలు.

జర్నలిజంలోనూ, సినిమావిమర్శలోనూ కొడవటిగంటిని ఒకరకమైన పయోనీర్‌గా చెప్పుకోవచ్చు. 'రచన' విభాగంలో దాసరిసుబ్రహ్మణ్యం, సూరంపూడి సీతారామ్, బిబిజి తిలక్ ఈ విషయాలను హృద్యంగా వివరించారు. రచనాశిల్పం విషయంలో బొమ్మిరెడ్డిపల్లి సూర్యారావు చక్కని వివరణఇచ్చారు.

ఆయన జీవితాన్ని మా. గోఖలే, ఆయన రోజువారీ కార్యక్రమాన్ని ప్రవర్తనసూ ఆయన కొడుకు రోహిణీప్రసాద్ చాలా ఇంటిమేట్‌గా వివరించారు. ఆయన సంగీతాభిమానాన్ని వైణికవిద్వాన్ చిట్టిబాబు, ఆయన విధినిర్వహణను గురించి బి. విశ్వనాధరెడ్డి చక్కనివ్యాసాలు రాసారు అనడంకన్నా, తమ అనుభూతులను అద్భుతంగా ప్రస్ఫుటీకరించారు. 'తెలుగువారి చందమామ'గా కొడవటిగంటిని అభివర్ణించుతూ తనకూ కొడవటిగంటికీ ఉన్న పరిచయాన్ని, సాన్నిహిత్యాన్ని పురాణం చమత్కారపూరితంగా వివరించారు అయితే "విరసంలో ఉంటూకూడా ఆయన ఆ వ్యవహారాల్లోకి లోతుగా దిగలేదు. ఉత్తరాలు వ్యాసాలద్వారా వాక్యసహాయంమాత్రం చేస్తుండేవారు. అంతకుమించి ఆయన ఎక్కువగా ఏదీ ఒంటికిపూసుకోలేదు" అని పురాణం అనడంమాత్రం అజ్ఞానజన్యం. అంతేకాక ఆత్మవంచన. "క్రుశ్చేవ్‌కు టెంగ్ పియావోపెంగ్‌కు తేడాలేదు" అని కె. జి కృష్ణమూర్తిగారితో అన్న కొ. కు "విరసం"పట్ల అంటీఅంటనట్లుగా ఉంటాడంటే కొ. కు ప్రవర్తనకే విరుద్ధం. కొ. కు. కు ఉన్న ఉద్యోగరీత్యా అందులోనూ మద్రాసులో ఉన్నందువల్ల, విరసం కార్యకలాపాల్లో విస్తృతంగా పాల్గొని ఉండకపోవచ్చు దాన్నే "ఒంటికి పట్టించుకోకపోవడం"గా భావించి పురాణం సంతృప్తి పడదలిస్తే అలాగేకానివ్వండి. 1955లో శ్రీశ్రీ కమ్యూనిస్టుల తరఫున ప్రచారానికి వచ్చాడు. కొ. కు రాలేదు. అయితే నిర్ద్వంద్వంగా ఆయన శ్రీశ్రీపక్షంనిలిచాడు. నిజమైన మేధావికి కమిట్‌మెంట్‌కూ నిమగ్నతకూ తేడాఉండదు. అలాంటివాడు కొడవటిగంటి. ఏదోమనసంతృప్తికోసం కొ. కు. లాంటివాణ్ణి విరసంనుండి విడదీయడానికి ప్రయత్నించడం ధూర్తత్వం. కొ. కు. నిబద్ధుడుకాడూ అంటే ఆయన రచనావ్యాసంగంలో ఏర్పరుచుకున్న గమనాన్ని మొత్తంగా తిరస్కరించడమే అవుతుంది. ఒక్కటి గమనించాలి. ఆయన తనసుతాను తెలుసుకున్న రచయిత, లోకాన్ని తెలుసుకోవాలని ప్రయత్నించిన రచయిత. కేవలం వృత్తిరచయిత (Proffessional Writer ) కాదు.

చివరగా ఈ సమీక్షకుడి దొక చిన్నసందేహం. కొడవటిగంటి సృజనాత్మక రచనా కార్యక్రమాన్ని చేపట్టకుండా మొదటినుంచీ సామాజికసమస్యలపై పరిశోధనా కార్యక్రమాన్ని చేపట్టిఉంటే ఇంతకంటె ఎక్కువ ప్రయోజనం ఉండిఉండేదికాదా? ఈ ఊహకు బలంకలిపించే ప్రయత్నం ఎవరైనాచేస్తే అదే కొడవటిగంటికి నివాళి, ఆంధ్రదేశానికి వరం, మనకు జార్జిథాంప్సన్‌లూ, డిడి కొసాంబీలు అవసరం.

— రహి

---

భావ వి ప్ల వ కా రు డు కొడవటిగంటికుటుంబరావు సాహిత్య సమాలోచన పేజీలు : 196, 1/8 డెమ్మీ, పదిరూపాయలు. ప్రచురణ : ప్రగతి సాహితి, న్యూఢిల్లీ, ప్రతులకు : బిబిజి తిలక్, 102, పూర్వాంచల్, జెఎన్‌యు, న్యూఢిల్లీ 110 026.

# జానపద గేయాలు - పరిశోధన

ఈ సమీక్షావ్యాసంలో 'తెలంగాణా శ్రామికగేయాలు', 'జానపదవిజ్ఞానం: సేకరణ-అనుభవాలు' అనే రెండు పుస్తకాలను పరిశీలించడం జరుగుతున్నది.

ఇందులో మొదటిపుస్తకం పి హెచ్.డి. డిగ్రీకొరకు రచయితరాసిన పరిశోధనా వ్యాసం. ఈ పరిశోధనావ్యాసంలో ఏడు అధ్యాయాలు, రెండు అనుబంధపట్టికలు, కొన్ని ఫోటోలు ఉన్నాయి. ఆయా అధ్యాయాల్లో జానపద సాహిత్యంలో శ్రామిక గేయాలగురించి, ఆ గేయాల్లోని రసపోషణ, ఛందస్సంగీతాలగురించి, సాంఘికజీవనం గురించి వివరించబడింది.

పరిశోధనలో భాగంగా పాటలు సేకరించడానికి గ్రామాలకు వెళ్ళినప్పుడు రచయితకుకలిగిన అనుభవాలను రెండవపుస్తకం తెలుపుతుంది.

ఏ జాతి చరిత్రలోనయినా సాహిత్యం మొదట జనపదాల్లోపుడుతుంది. ఆ సాహిత్యం మొదట తీసుకునేరూపం లయబద్ధమైనపాట. శ్రమ ద్వారా ఉత్పత్తిని సులువుగా చేయడంకోసం శ్రమలోంచి పాట వస్తుంది. అతిప్రాచీనకాలంలో ఇది గ్రామీణుల ఆదిమసంస్కృతిని, జీవితాన్ని, భావాలనుతెలియజేసి ఉంటుంది. సమాజంలో వర్గవిభజన ఏర్పడిన తరువాత శ్రామికుని శ్రమఫలితం పరాయీకరణ చెందినట్లుగానే పాటకూడ రూపంలో మార్పునుపొందకున్నా పాలకవర్గభావాలకు, సంస్కృతికి నిలయమయింది. ఇవ్వాళ విశ్వవిద్యాలయాల్లో జానపద సాహిత్యంమీద అకడమిక్ స్థాయిలో పరిశోధనలు చేస్తున్నవారిలో చాలమంది పరాయీకరణ చెందిన సాహిత్యాన్నే పరిశీలించి గొప్పపనిచేసినట్లుగా చెప్పుకుంటున్నారు. జానపదగేయాలమీద పరిశోధన కూడా ఈ విధంగానే జరుగుతున్నది. ప్రజలసొత్తు అయిన జానపదసాహిత్యంలోని పాలకవర్గభావాలను, సంస్కృతిని విశ్లేషించి, అది ఏ విధంగా పరాయీకరణను పొంది, పాలకవర్గానికి ఊడిగంచేస్తున్నదో తెలుపగలిగితే అది గొప్పపనేఅవుతుంది. కాని అందుకు భిన్నంగా జానపదసాహిత్యం దానిలోని పరాయీకరణకే గొప్పచేయబడుతున్నది. అభ్యుదయభావాలున్నట్లుగా చెప్పుకునేవాళ్ళు, పేరుతెచ్చుకున్నవాళ్లకూడ ఈ అకడమిక్ చట్రంలో తెలిసిగాని, తెలియకగాని చిక్కుబడిపోతున్నారు. ఈ పుస్తకాలు చదివిన తరువాత నాకుకల్గిన భావాలు ఇవి.

జానపద విజ్ఞానసేకరణను పరిశోధనపరకే పరిమితం చేయకుండా జీవితంలో ఒకభాగంగా ఎంచుకున్నానని చెప్పుకుంటున్న రచయిత మొదట అకడమిక్ స్థాయీ పరిశోధననుండి బయటపడాలి. తన పరిశోధనానుభవాలను వివరించిన పుస్తకాన్ని

చదివినపుడు రచయిత తన పరిశోధనకే నిలాపరిమితమయారో తెలుస్తుంది. జానపద విజ్ఞానసేకరణ దానంతటఅది గొప్పవిషయంకాదు. సేకరించిన విజ్ఞానాన్ని ఉపయోగించిన తీరునుబట్టి ఆ పని గొప్పదవుతుంది. ప్రజల సొత్తయిన జానపదవిజ్ఞానంలోని పాలకవర్గభావజాలాన్ని విశ్లేషించి, వేరుచేసి, ప్రజాకళారూపంలోఉన్నా ఒక సాంస్కృతిక ఆయుధంగా ప్రజలచేతికి ఇవ్వడం ఈనాటి అవసరం. జానపదసాహిత్యంలోని ప్రజావ్యతిరేక సంస్కృతిని ఎత్తిచూపడం ఒక విమర్శకుడు తప్పనిసరిగా చేయవలసినపని. ఆ పని జరగనప్పుడు జానపద విజ్ఞానసేకరణవల్ల జానపదులకు ఒరిగేది ఏమీఉండదు, సేకరించినవారికి తప్ప. ఈ దృక్పథంతో ఆలోచించినప్పుడు ఈ పరిశోధనావ్యాసంగంవల్ల పరిశోధకునికి పట్టారావడం, కొన్ని జానపదగేయాలు రికార్డు కావడం మాత్రం జరిగిందని చెప్పవచ్చు.

'తెలంగాణా శ్రామికగేయాలు' అన్న ఈ పుస్తకంలో వ్యవసాయానికి, వ్యవసాయంమీద ఆధారపడిన ఇతరవృత్తులకు సంబంధించిన గేయాలు సేకరించబడ్డాయి. అయితే విసుర్రాయి పాటలు, దంపుడుపాటలు తప్ప మిగిలిన 'శ్రామికగేయాలు' ప్రధానంగా శృంగారగేయాలుగానే ఉన్నాయి. ఇందుకు రచయితను ఆక్షేపించవలసిన పనిలేదు. జానపదగేయాల్లో శృంగారం ప్రాధాన్యంగానే ఉంటుంది. అయితే శృంగారం వాళ్ల శ్రామికజీవితంకంటె ఎందువల్ల ప్రాధాన్యాన్ని వహించిందో చెప్పడం మాత్రం విమర్శకుడు స్వీకరించవలసిన బాధ్యత. జానపదసాహిత్యంద్వార శ్రామికులు శ్రామికజీవితాన్ని తెలుసుకోకుండా ఉండేందుకు శృంగారంచేత, మతభావాలచేత, మూఢవిశ్వాసాలచేత, ఆధ్యాత్మిక విషయాలచేత ఆ సాహిత్యం కప్పివేయబడతుంది ఇది ఉద్దేశపూర్వకంగా జరిగినపని. ఇలా అనడంవల్ల జానపదుల్లో శృంగారభావాలుఉండవనికాని, వారి శ్రామికజీవితానికి అవి ఉల్లాసాన్ని కల్పించవనిగాని నా అభిప్రాయం కాదు. అందుకు శృంగారమే ప్రధానం కావలసిన అవసరంలేదు. విమర్శకుడు తన బాధ్యతను నెరవేర్చదలుచుకోనప్పుడు "మునుము మునుముకు ముద్దులిస్తా" వంటివాటిని సరికొత్త ప్రయోగాలని ప్రశంసించకతప్పదు. ఒకవైపు స్వేచ్ఛాప్రణయాన్ని ప్రస్తుతిస్తూనే మరోవైపు హైందవస్త్రీకి శీలమే ప్రధానమని అనవలసివస్తుంది. ఈ విధంగా అనేక సందర్భాల్లో వ్యక్తంచేసిన భావాలనుబట్టిచూస్తే రచయిత హైందవధర్మానికి అనుకూలమైన అభిప్రాయాలు ఉన్నవాడుగాతోస్తుంది. ఒక పాటలో ఒకఊరి పటేలు పాపిరెడ్డి మాదిగఎల్లోజిని వెట్టిపనిమీదపంపి, అతని భార్య నారమ్మను మానభంగం చేయడానికిప్రయత్నించి, విఫలుడై, ఆమెను చంపివేస్తాడు. తరువాతమాదిగ ఎల్లోజి

తనవారితోకలసి దొంగనుచంపడానికిరాగా అతడుప్రాణభిక్షకొరకు ప్రాధేయపడతాడు ఎల్లోజీ పాపిరెడ్డిని విడిచిపెడతాడు. ఈ పాటను వివరిస్తూ రచయిత ఎల్లోజీ ఔదార్యం గొప్పదని, అయితే భార్య ప్రాణాల్నితీసిన దుర్మార్గున్నివిడిచి చైతన్యహీనుడయాడని, ఇది హైందవధర్మానికి ప్రతీక (పే. 217-218) అని వరుసగా తనఅభిప్రాయాలను వెల్లడిస్తారు. ఈ అభిప్రాయాలను బట్టి రచయితకు ఒక నిర్దిష్టమైన పరిశీలనాపద్ధతి, ఒక విషయం మీద ఖచ్చితమైన అభిప్రాయాలు లేవని అర్థమవుతుంది.

జానపదగేయాల గురించిన పుస్తకమంటే కేవలం పాటలవివరణే అనే అపప్రథ ఉన్నదని, ఈ పుస్తకం దీనినుంచి బయటపడిందని ప్రారంభంలో రచయిత చెప్పుకున్నారు. వారు పేర్కొన్న అపప్రథ వాస్తవమైనదే. కాని ఈ గ్రంథంకూడ పాటలను వివరించడంకంటె మించి చేసిందేమీలేదు. ఎన్నోపాటల్లో కనిపిస్తున్న భావాలను, సంస్కృతిని పరిశీలించి, విశ్లేషించి, మంచీచెడులను చూపగల కనీస శాస్త్రీయదృష్టినికూడ రచయిత ప్రదర్శించలేదు. ఆ కారణంగానే జానపదగేయాల మీద సాగిన ఈ పరిశోధన జానపదులకు ఏమాత్రం ప్రయోజనాన్ని కలిగించేదిగా లేదు. ఈ పుస్తకంలో ఒకపద్ధతిప్రకారం వెలుగులోకి తేబడిందన్న తెలంగాణా ప్రజల సంస్కృతి, నిజానికి తెలంగాణాప్రజల సంస్కృతిలోఉన్న ప్రజావ్యతిరేక సంస్కృతి.

కలుపుపాటలను వివరించిన భాగంలోని ఒకపాటలో (పే. 80-82) విషాహారం వల్ల చనిపోయిన తన కుటుంబసభ్యులందరిని, ఒకస్త్రీ వేములవాడ రాజన్నకు మొక్కు కొని, అతని మహాత్మ్యంవలన బతికించుకొంటుంది. పాటలోని ఈ అంశాలను వచనంలో వివరించి, రచయిత అదనంగా వేములవాడను దక్షిణకాశీ అంటారని, శివరాత్రి సమయంలో ఇక్కడ పెద్దజాతర జరుగుతుందని, ఆ సమయంలో తెలంగాణాలోని అన్నిప్రాంతాలనుండీ అక్కడికి బస్సులు నడుస్తాయని చెప్పారు. ఇక్కడ పాటనుసేకరించి, తాత్పర్యాన్ని వివరించడంకంటెమించి చేసిన పరిశోధన ఏమున్నది? ఆ పాటను వివరించడంలో కనీస శాస్త్రీయ దృష్టయినా రచయిత అవలంబించడం జరిగిందా? దేవునికి మొక్కులుచెల్లించి చనిపోయినవారిని బతికించుకోవడం తెలంగాణా 'ప్రజలసంస్కృతి' అవుతుందా? ఇటువంటిపాటలు, వివరణలు, అదనపు సమాచారాలు ఈ పుస్తకంలో అనేకంగాఉన్నాయి.

తాను పరిశీలిస్తున్న విషయంపట్ల పరిశోధకునికి శాస్త్రీయదృష్టి లేకపోవడం అన్నది పరిశోధకుడే అశాస్త్రీయభావాలను ప్రకటించేస్థితికి చేరుకొంటుంది. నిజానికి ఈ రెండింటిమధ్య ఉన్న భేదంస్వల్పమే.

కాంభోజరాజు కథలో (పే. 234) "ఊగనిమాను ఆకుకావలెను, లోతులేని బావినీరు కావలెను". అంటూ రకరకాల గొంతెమ్మకోర్కెలను వైద్యంకొరకు కోరతాడు. ఈ సందర్భంలో "అసాధ్యాలైన విషయాలు సాధ్యాలు చేయడానికి ఆకాలాన్నే చెల్లుతుంది. ఇప్పుడు వీలుపడదు" అంటూ రచయిత వ్యాఖ్యానిస్తున్నారు. మరొకచోట (పే. 259) శ్రామికులకున్న మూఢవిశ్వాసాలను ఒక జాబితాగాతెలిపి, ఈ మూఢ విశ్వాసాలుండడానికి కారణం ప్రకృతి వైపరీత్యాలు, అమాయుకత, నిరక్షరాస్యత అని పైపై కారణాలను ఒకసారిచెప్పి. "కొందరు విద్యావంతులు ఈ విశ్వాసాల్లో ఆరోగ్యసూత్రాలిమిడిఉన్నాయని చెప్పుతారు" అని మరోసారిచెప్పి. ఆ "విశ్వా వంతు"ల కోవలోకి రచయిత చేరుతున్నారు.

జానపద గేయాలమీద సాగిన ఈ పరిశోధన ఏవిధంగా ఉన్నదో తెలుసుకోవ డానికి ఇంతవరకు ఇచ్చిన ఉదాహరణలు సరిపోతవి. ఈనాడు మన విశ్వవిద్యాలయాల్లో జరుగుతున్న పరిశోధనలన్నీ దాదాపు ఇదేవిధంగా ఉంటున్నాయి. ఒకవైపు కాలం చెల్లి, ఏవిధంగానూ ప్రజలకుపయోగించని సాంప్రదాయిక పద్ధతుల్లో పరిశోధనలు జరుగుతుండగా, మరోవైపు అభ్యుదయ దృక్పథంతోనూ, మార్క్సిస్టు దృక్పథం తోనూ చేసిన పరిశోధనలుగా చెప్పబడుతున్నవి పూర్తిగా ఆ దృక్పథాలను కలిగినవి కావు. జానపదగేయాలగురించి అయినా, ఇతర సాహిత్యరంగాల గురించి అయినా శాస్త్రీయదృక్పథంతో మౌలికంగా పరిశోధనచేస్తున్నవారు ఇవ్వాళ విశ్వవిద్యాలయాల బయటనేఉన్నారు. విశ్వవిద్యాలయాల్లో పనిచేస్తున్న కొంతమంది ఈ పనిచేస్తున్నా అది వాళ్ల విశ్వవిద్యాలయాల బయటనే చేస్తున్నారు. నిజమైన శాస్త్రీయదృక్పథాన్ని కలిగి సాహిత్యంగురించి మౌలికపరిశోధన చేసేవాళ్లని విశ్వవిద్యాలయాలు ప్రయత్న పూర్వకంగానే దరిచేరనివ్వడంలేదు. అందుకే మన విశ్వవిద్యాలయాల్లో పరిశోధన స్థాయి దిగజారిపోతున్నది, పోతుంది కూడా!

— ప్రాణహిత

---

1. తెలంగాణా శ్రామికగేయాలు ; పేజీలు : xii + 334; వెల : 25 రూ. లు 2. జానపద విజ్ఞానం : సేకరణ - అనుభవాలు ; పేజీలు : xii + 72; వెల : 4 రూ. లు; ఈ రెండుపుస్తకాల రచయిత - డాక్టర్ గోపు లింగారెడ్డి, ప్రతులకు : 1. రచయిత, పోస్ట్ అల్గునూరు, తా॥ జి॥ కరీంనగర్ - 505 533; 2. దేశ్‌ముక్ హౌస్, నారాయణగూడా, హైదరాబాద్ - 500 020.

రిపోర్టు :

శ్రీకాకుళం మాకివలసలో
కోమర్తి నర్సన్నపేటలో
'కో' యంటే 'కో' అంటూపలికిన
ఎదలోబాధా కరీంనగారా

# ధ్వనించిన జ్వలించిన విప్లవ రచయితల సంఘం పదవ రాష్ట్ర మహాసభలు

అక్కడ కట్టిన ఎర్రజెండా తోరణాలు సభాస్థలికి దారిచూపెడుతున్నాయి. అక్కడ ఎగరడానికి సిద్ధంగావున్న విరసం జెండా శత్రువుతో రణాలను అమరుల వీరమరణాలను ఎలుగెత్తి చాటేందుకు ఆకాశమంత జనహృదయాన్ని పిడికిట్లో దాచుకున్నట్లుగా సభా స్థలిముందు సాంస్కృతిక సైనికునిలా నిలుచునివున్నది. లోపల వేదిక, అమరవీరుల చిత్రపటాలతో పోరాట నినాదాలతో నిన్నటిజ్ఞాపకాలను రేపటి విజయాలను రూపుగట్టే వర్తమాన అగ్నిపర్వతం. విరసం 1984 జనవరి 11, 12, 13 తేదీల్లో తన సభలను జరుపుకోవడానికి శ్రీకాకుళం మాకివలసగ్రామంలో నిర్మించుకున్న సుబ్బారావు పాణిగ్రాహినగర్ అది. విరసం సభ్యులు, వందలాది ప్రతినిధులుకాక వివిధ రాష్ట్రాలనుంచి ఎందరో సౌహార్ద్ర ప్రతినిధులు ఆ సభకు హాజరయ్యారు.

11వ తేదీ ఉదయం కా॥ వావిళ్ళపల్లి అజయకుమార్ చేసిన పతాకావిష్కరణతో కార్యక్రమం మొదలయింది. విశాఖ జననాట్యమండలి 'సుత్తికొడవలి గుర్తుగవున్న' పాటను, హైదారాబాద్ జననాట్యమండలి 'ఎర్రజెండెర్రజెండెన్నియలో' పాటను, కా॥ రుద్రజ్వాల 'ఎత్తినాం విరసంజెండా' పాటనుపాడారు. 'కష్టజీవులంమేం కమ్యూనిస్టులం' పాటతో సభమొదలయింది.

"పేదప్రజల కష్టాలను దూరంచేయగలశక్తిని అందించే సాహిత్యాన్ని సృష్టించి నూతన ప్రజాస్వామిక విప్లవంలో సాంస్కృతిక సైన్యంగా ఐక్యంకండి" అంటూ ఆహ్వాన సంఘ అధ్యక్షుడు డా॥ సి.వి. రామకృష్ణారావు ఆహ్వాన సంఘం తరఫున సభకు విప్లవ ఆహ్వానం పలికారు.

తర్వాత 'రెవల్యూషనరీ రైటర్స్ ఆర్టిస్ట్స్ అండ్ యింటలెక్చువల్ అసోసియేషన్' తరఫున బెంగాల్‌నుండి, 'నవజన్‌వాదీ క్రాంతికార్‌సంఘటన' తరఫున బీహార్‌నుండి, 'పీపుల్స్ ఆర్ట్ ఫోరమ్' తరఫున తమిల్నాడునుండి, 'సంఘర్ష్ నాట్య మంచ్' తరఫున గోవానుండి, 'జనకళా మండలి' తరఫున కర్ణాటకనుండి. 'అవాహన్

నాట్యమంచ్' తరఫున మహారాష్ట్రనుండి సౌహార్ద్ర ప్రతినిధులుగా వచ్చిన కామ్రేడ్స్ తమసందేశాలుయిచ్చారు. అట్లాగే విరసం సోదరసంస్థలైన జననాట్యమండలి, రైతు కూలీసంఘం, పిడియస్‌యు, ఆర్‌యస్‌యు, రాడికల్‌యూత్‌లీగ్, ఎఐఎల్‌ఆర్‌సి, సింగరేణి కార్మికసమాఖ్య, ఇఫ్టు, రైతాంగ పేదలకమిటీ, ప్రగతిశీల కార్మిక సమాఖ్య వంశధార పేపర్‌మిల్స్ తమ సందేశాలు వినిపించాయి.

సిపిఐఎంఎల్, సిపిఐఎంఎల్ పీపుల్స్‌వార్ తమసందేశాన్ని అందజేశాయి.

విరసం సభ్యుడు కా॥ సాహూ విశాఖజైలునుంచి విరసానికి లాల్‌సలామ్‌చెప్తూ తన సందేశాన్ని పంపాడు.

తర్వాత కా॥ టిఎమ్ఎస్ కార్యదర్శి నివేదిక చదివారు. ఉత్తేజ పూర్వకమైన ఆ నివేదికలో మాచెర్లనుంచి మాకివలసదాకా విరసం నిర్వహించిన అనేక కార్య క్రమాల్ని ప్రస్తావించారు.

శ్రీకాకుళపోరాటంలో గ్రామాలకుగ్రామాలే గహనమైపోయాయని, ఎంతో మంది తమ నిండుప్రాణాలను త్యా గం చే శా ర ని చెప్తూ కా॥ అప్పల్నాయుడు, కా॥ వావిళ్ళపల్లి సత్యనారాయణకుమారుడు కా॥ అజయ్‌కుమార్‌ని, కా॥ ఆదిభట్ల కైలాసం సహచరి కా॥ సూర్యకాంతమ్మని, కా॥ గుమ్మడి లచ్చయ్యకూతురు కా॥ ఎర్రమ్మని, కా॥ తామాడ గణపతికుమారుడు కా॥ త్రిలోచన్‌ని, కా॥ మార్పు పద్మనాభంకుమారుడు కా॥ సీతారామయ్యని, కా॥ గొరకల సన్యాసిరావుతమ్ముడు కా॥ బాలకృష్ణని, కా॥ ఉర్ల మల్లేశ్వరరావు తండ్రి కా॥ సూర్యనారాయణని, సభకి పరిచయంచేశాడు.

11నాడు మధ్యాహ్నం కా॥ రాంబాబు అధ్యక్షతలో విరసం కార్యవర్గ సభ్యుడు కా॥ చెంచయ్య 'ఉత్తరాంధ్ర సాహిత్యచరిత్ర' పాఠంచెప్పారు. 18వ శతాబ్దం పూర్వభాగంలోవున్న గోగులపాటి కూర్మనాథకవి మొదలుకొని కందుకూరి, గురజాడ, శ్రీశ్రీ, రావిశాస్త్రి, కాళీపట్నం రామారావు, భూషణం మొదలైన ఉత్తరాంధ్ర రచయితల సాహిత్యాన్ని చెంచయ్యగారు వివరిస్తూ సంఘసంస్కరణ, అభ్యుదయ, విప్లవకవిత్వాలకు ఉత్తరాంధ్ర నాందీపలికిందని చెప్పారు. విప్లవోద్యమానికి, సుబ్బారావు పాణిగ్రాహికి, విరసానికివున్న విడదీయలేని అనుబంధాన్ని వివరించారు. వంగపండు, ఎన్. ఎస్. ప్రకాశరావువంటివారు యీనాటి విప్లవోద్యమానికి చెందినవారని తెలిపారు.

ఆనాటిరాత్రి దాదాపు 40 మంది కవులతో జరిగిన కవిసమ్మేళనం తర్వాత మాకివలస గ్రామంలో అరుణోదయ, విజయనగరం కేంద్ర జననాట్యమండలివారిచే సాంస్కృతిక ప్రదర్శనలు జరిగాయి, కా॥ భూపాల్ సాంస్కృతిక కార్యక్రమాల్ని నిర్వహించాడు.

12వ తేదీ ఉదయం జరిగిన 'జాతీయోద్యమం' అన్న పాఠానికి కా॥ కె వి. ఆర్ అధ్యక్షత వహించారు. కా॥ టి ఎమ్.ఎస్. ప్రసంగించారు. కా॥ కె వి. ఆర్ జాతీయోద్యమం నాటి రాజకీయాలను కా॥ టి.ఎమ్ ఎస్. జాతీయోద్యమకాలంనాటి సాహిత్యాన్ని విశ్లేషించారు.

దేశభక్తికీ, దేశాభిమానానికీ తేడావుందని కా॥ కె.వి.ఆర్ చెప్తూ విశాలప్రజానీకంలో వుండేభావం దేశాభిమానమని, దేశాభిమానం చెడ్డభావంకాదని అన్నారు. 13, 14, 15 శతాబ్దాలలో యూరప్‌లో జాతిరాజ్యాలు ఏర్పడిన నాటినుంచి 1947 ఆగస్టు 15నాటి రాజకీయాలవరకు కా॥ కె.వి.ఆర్ వివరమైన ప్రసంగం చేశారు.

ఫ్రెంచి విప్లవంవల్ల ఆధునిక జాతీయభావం వచ్చిందని కాని బ్రిటిష్‌వారు మనదేశంతో ప్రవేశించిన 250 సంవత్సరాలకుగాని మనదేశంలో ఆధునిక జాతీయభావం తలెత్తలేదని చెప్తూ 1857ను వివరించి ప్రారంభంలోనే మన బూర్జువాలు జాతీయప్రయోజనాన్ని విస్మరించారని 1947 ఆగస్టు 15 బూర్జువావర్గం కోసమే అని తెలియజెప్పారు.

కా॥ టి.ఎమ్ఎస్ మాట్లాడుతూ భావకవిత్వంనుండి జాతీయకవిత్వం వచ్చిందన్న అభిప్రాయం చాలా తప్పుడు అభిప్రాయమని నిజానికిజాతీయకవిత్వంలో ఒక బలహీనమైన భాగంమాత్రమే భావకవిత్వమని వివరించారు. జాతీయోద్యమం జరుగుతున్నపుడు రాసిన ఉద్యమసాహిత్యం objectiveగా వుంటుందని భావకవిత్వం subjective గా వుంటుందని అంటూ జాతీయోద్యమంలోని నిర్దిష్టమైన లక్ష్యాలను, ఎత్తుగడలను తీసుకోక స్వేచ్ఛనుగురించి దేవులపల్లి భావకవిత్వంలో చెప్పడాన్ని తప్పుగా అర్థంచేసుకోవద్దని అది ఒక abstract భావనఅని అంతేగాక ఒక్కొక్కప్పుడు భావకవుల్లో జాతీయోద్యమ ప్రభావం కనిపించినా అది తాత్కాలికమేనని చివరివరకూ నిలిచేదికాదనీ అన్నారు.

మధ్యాహ్నం కా॥ అల్లంరాజయ్య అధ్యక్షతలో కా॥ చలసాని ప్రసాద్ 'తెలుగుదేశంలో ఆదివాసుల తిరుగుబాట్లు' అన్న పాఠంచెప్పారు.

జాతీయోద్యమంకన్నా ఆదివాసుల పోరాటాలు శక్తిమంతమైనవని, ఆదివాసులను అనారోగ్యప్రాంతాల్లోకి పంపి ఆంగ్లేయులు దానికి ఏజెన్సీ అని పేరుపెట్టారని ఇది వాళ్ళుచేసినకుట్ర అని అన్నారు. పితూరీ అంటె విద్రోహం కనుక ఆ పేరువాడకుండా పోరాటం అని పిలవడం సరైందని ప్రసాద్ వివరించారు. రాజారాంభూపతి అనే ఆదివాసిచేసిన పోరాటాన్నిఎదుర్కోలేక 1813లో బ్రిటిష్‌వారు అతనితో రాజీపడడాన్ని, తమ్మన్నదొర నాయకత్వంలో గిరిజనులు అడ్డతీగల పోలీస్‌స్టేషన్‌ను బూడిదపాలు చేయడాన్ని, ద్వారబంధాల రామచంద్రయ్యకూడా అడ్డతీగల పోలీస్‌స్టేషన్ మీద దాడి చేసి వందమంది పోలీసుల్ని చంపడాన్ని, 1916-17 లంగరాయి పోరాటం మొదలు కొని ఆదివాసుల పోరాటాలను చలసాని వివరించారు. అల్లూరిసీతారామరాజుని విశాఖ జిల్లాలో మంపగ్రామం చెరువులో స్నానంచేస్తుండగా పోలీసులుపట్టుకుని కొయ్యూరికి తీసుకునివచ్చి చెట్టుకుకట్టి కాల్చిచంపి కృష్ణదేవిపేటలో ప్రజలు గుర్తించిన తర్వాత దహనం చేశారని ఇది పోలీసుల మొదటి ఎన్‌కౌంటర్‌గా చెప్పుకోవచ్చని తెలిపారు. తరువాత అల్లంరాజయ్య కొమురంభీం గురించి తెలిపారు.

12నాడు సాయంత్రం నమ్మ అధ్యక్షతలో కా॥ కె.వి.ఆర్. 'తెలంగాణా సాయుధపోరాటం' పాఠాన్ని చెప్పారు. తెలంగాణా పోరాట రాజకీయాలు సజీవమైన ప్రజారాజకీయాలని డాంగే, అజయ్‌ఘోష్, బసవపున్నయ్యలు రష్యాకు వెళ్ళివచ్చి స్టాలిన్ పోరాట విరమణ చేయమన్నాడన్న మాటల్ని అడవుల్లోని దళనాయకులకు చెప్పినప్పుడు చాలామంది వాళ్ళమాటల్ని అంగీకరించలేదని కూలీలు సన్నకారురైతులు పోరాట విరమణకు ఎంతమాత్రమూ ఒప్పుకోలేదని కా॥ కెవిఆర్ తన ప్రసంగంలో తెలిపారు.

12వ తేదీ రాత్రి మాశిబిరంనుంచి దాదాపు 3 కిలోమీటర్లదూరంలో వున్న కోమర్తిగ్రామానికి కాగడాల ప్రదర్శనతో వెళ్ళి కోమర్తిలో విరసం బహిరంగసభ నిర్వహించింది. కా॥ అప్పలనాయుడు అధ్యక్షతలో కా॥ చలసానిప్రసాద్, కా॥ విమల, కా॥ నమ్మ, కా॥ సి.యస్.ఆర్. ప్రసాద్ ఆ సభలో ప్రసంగించారు. ప్రభుత్వం శ్రీకాకుళ పోరాటాన్ని అణచేసినట్లు చెప్పుకుంటున్నది కాని శ్రీకాకుళ పోరాటం చల్లారిపోలేదని యివాళ అది తెలంగాణా భూముల్లో మండుతున్నదని శ్రీకాకుళ ఉద్యమం కొనసాగింపే ఆదిలాబాద్, కరీంనగర్, గోదావరిలోయపోరాటాలని వక్తలు తమ ఉపన్యాసాల్లోతెలిపారు. ఉపన్యాసాల అనంతరం సాంస్కృతిక కార్యక్రమాలు ప్రదర్శించబడ్డాయి.

13 ఉదయం కా॥ చలసాని ప్రసాద్ అధ్యక్షతలో 'శ్రీకాకుళ రైతాంగ పోరాటం' అన్నపాఠాన్ని కా॥ అప్పల్నాయుడు చెప్పాడు. శ్రీకాకుళంజిల్లా పార్టీ నిర్మాణాన్ని తెలియజేస్తూ రాజకీయ, సామాజిక, ఆర్థిక పరిస్థితులగురించి అప్పల్నా యుడు వివరిస్తూ గిరిజనులలోని సాంప్రదాయాలను, సంస్కృతిని కళ్ళకుకట్టించాడు. గిరిజనుల అమాయకత్వాన్ని, అజ్ఞానాన్ని ఆసరాగాతీసుకుని దోపిడీవర్గాలు వాళ్ళను ఎలా దోచుకున్నదీ ఆ దుర్భరజీవితాల్లో అక్కడికామ్రేడ్స్ ఎలా విప్లవపోరాటాన్ని రగిలించిందీ వివరించాడు. అమరవీరుల మరణాలగురించి అప్పల్నాయుడు వర్ణిస్తున్న పుడు అమరవీరులకు జోహార్లర్పిస్తూ అమరవీరుల ఆశయాలను కొనసాగిస్తామని సభ ప్రతిజ్ఞ తీసుకున్నది.

ఆరోజుమధ్యాహ్నం కా॥ నమ్మ అధ్యక్షతలో కా॥ వరవరరావు 'ఆదిలాబాద్‌కరీం నగర్ రైతాంగపోరాటాలు' వినిపించారు. నక్సల్బరీ, శ్రీకాకుళాలవలెనే ఆదిలాబాద్ కరీంనగర్‌లు వర్తమానంలోనే పోరాట సంకేతాలయినాయని వరవరరావు అన్నాడు. లక్ష్మీరాజ్యం (జగిత్యాల), పోశెట్టి (సిరిసిల్లా) బలిదానాలతో కరీంనగర్ ఆదిలాబాద్ పోరాటం ప్రారంభమయిందని చెప్తూ అక్కడి పోరాటచరిత్రను ఆయన వివరించారు. ఆదిలాబాద్, కరీంనగర్ పోరాటసాహిత్యం ఆ పోరాటం జరుగుతుండగానే వస్తున్న దని ఆ వచ్చిన సాహిత్యాన్ని వరుసక్రమంలోపెట్టి ఆ పోరాటచరిత్ర రాయవచ్చని వారన్నారు. ఆదిలాబాద్ కరీంనగర్ పోరాటం చరిత్రను సాహిత్యంగా, సాహిత్యాన్ని చరిత్రగా చేస్తున్నదనీ విప్లవసందేశం విప్లవ ప్రజానీకందగ్గరకు పోవాలని కోరుకుంటే చదువుకునే పాహిత్యం వినగలిగేసాహిత్యం కావాలన్నారు. ఆదిలాబాద్ కరీంనగర్‌లు మన రచయితలకు ఒక సవాల్ అని ఆ పోరాటాన్ని మౌఖిక సాంప్ర దాయంలో మనం వ్యక్తీకరించాలని తెలిపారు.

ఈ ప్రసంగానికి ముందు ప. గోదావరి జిల్లా జన నాట్యమండలి బాలలు 'నక్సల్బరి బిడ్డలు' బుర్రకథను ప్రదర్శించిన తీరు ఎంతో గొప్పగా వుండి సభికుల ప్రశంసల ప్రశంసలనందుకున్నది.

ఆ తర్వాత కా॥ సురా అధ్యక్షతలో కా॥ హెచ్చార్కె 'నేటి సాంస్కృతిక రంగం'ను వివరించారు.

రాజ్యాంగయంత్రపు అణచివేతకంటె సాంస్కృతిక రంగంలో పాలకవర్గ భావజాలం మరింత ప్రమాదకరమని, పాలకవర్గాల చేతిలో నాలుగయిదు అంతస్థుల్లో

వున్న రేడియో, టెలివిజన్, వీడియో, పత్రికలు మొదలైనవి ప్రచారం చేస్తున్న దంతా అంతిమ పరిశీలనలో భూస్వామ్య సామ్రాజ్యవాద సంస్కృతినేఅని అధ్యక్షోప న్యాసంలో కా॥ సురా చెబుతూ పాలకవర్గాల చేతిలోని పై ప్రచారసాధనాలు ప్రజా ప్రక్రియ కాజాలవని మౌఖిక సాంప్రదాయం ప్రజాప్రక్రియఅని తెలియజేశారు.

కా॥ హెచ్చార్కె మాట్లాడుతూ పాలకవర్గ సాంస్కృతికరంగం, ప్రజా సాం స్కృతికరంగం అని రెండురకాలుగా సాంస్కృతికరంగం వుంటుంది అన్నారు. ప్రజలు డిఫెన్స్లో వున్నప్పుడు ప్రజాసాంస్కృతిక రంగం ఉద్యమరూపంలో వుండడం అవసరమని చెబుతూ సినిమాఅన్నది మాస్‌మీడియా, అది పాలకవర్గ సాం స్కృతికరంగంలో నిర్వహిస్తున్నపాత్ర చాలాపెద్దది అన్నారు. ఈనాడు సినిమాల్లో వస్తున్న ప్రకటనలద్వారా పాలకులు ప్రజలకు వైఖరులు, అభిప్రాయాలు ఎలా అమ్ముతున్నారో వివరించారు. ఈ వ్యవస్థ యిట్లావున్నంతకాలం మాస్‌మీడియా నుంచి మార్పుల్ని ప్రయోజనాల్ని అందించజాలక పోవడమేకాక యివాళ మాస్ మీడియా జీవితంపట్ల అగౌరవాన్ని పెంచుతున్నదని తెలియజేశారు.

తరువాత విరసం ప్రవేశపెట్టిన 'తెలంగాణాలో పోలీస్‌రిప్రెషన్' 'ప్రస్తుత రాజకీయపరిస్థితి', 'చలో హైదారాబాద్ (ABVP), కాకతీయ యూనివర్సిటీలో పోలీసుల దమనకాండ', 'యూనివర్సిటీలో పోలీసుశిబిరాలు', 'ప్రస్తుత సాహిత్యపరిస్థితి' మొదలైన తీర్మానాలను సభ ఆమోదించింది.

ఆ సాయంత్రం మాకివలస నుంచి దాదాపు 10 కిలోమీటర్లదూరంలోవున్న నర్సన్నపేటకు కాగడాల ప్రదర్శనతో వెళ్ళి అక్కడ విరసం బహిరంగసభ నిర్వ హించింది. కా॥ వరవరరావు కార్యదర్శిగా ప్రకటించబడ్డ ఆ సభలో కా॥ కృష్ణాబాయి అధ్యక్షతన కా॥ కె.వి.ఆర్, కా॥ హెచ్చార్కె, కా॥ వరవరరావు మొదలైన విరసం కార్యవర్గ సభ్యులేగాక బెంగాల్‌నుంచి, తమిళ్నాడు నుంచి, మహారాష్ట్రనుంచి వచ్చిన సౌహార్ద్రప్రతినిధులుకూడా ప్రసంగించారు.

'పెన్నూగన్నూపట్టిన ప్రజాకవి పాణిగ్రాహిని ప్రభుత్వం చంపింది. అప్పుడు మనం మౌనం వహించలేదు. విరసం ఆవిర్భవించింది, ప్రభుత్వం చెరబండరాజుని చంపింది. మనం మౌనంవహించలేదు, అనేకానేక కంఠాలులేచి విప్లవగానాన్ని విని పిస్తున్నాయి. ఏ ఆశయంకోసమైతే అమరవీరులు తమ ప్రాణాన్నిత్యాగంచేశారో దాన్ని సాధించేవరకు యీ పోరాటం కొనసాగుతూనేవుంటుంది' అని ఎంతో ఉద్వేగంతోచెప్పిన మహారాష్ట్ర కామ్రేడ్ మాటలు సభలో వినదించాయి. తర్వాత సాంస్కృతిక కార్యక్రమాలు కొనసాగాయి.

# "అభివృద్ధి కార్యక్రమాలు" ఎందుకోసం?

పోలీసులు "అభివృద్ధికార్యక్రమాలు" చేపట్టడం ఎక్కడయినా చూసారా ? వరంగల్ కురండి కంటికింపుగా చూద్దురుగాని. "తీవ్రవాదుల బోధనలకు ఆకర్షితులవుతున్న ప్రజలను మరల్చేందుకు" వరంగల్ జిల్లాలో అధికారులు నడుంబిగించారనీ ఆ ప్రయత్నంలో రెవెన్యూ పోలీసుశాఖలు ప్రధానపాత్ర వహిస్తున్నాయనీ, తెలుగుదేశం పార్టీ అధికార దినపత్రిక "ఈనాడు" ఫ్రంటుపేజీలో రాసుకుంది. "ఈనాడు"కు నిన్నటి చరిత్ర గుర్తులేదుగాని ప్రజలకు బాగానేజ్ఞాపకంవుంది. బ్రిటిష్‌వాడు మనల్ని పాలించినరోజులలో రెవెన్యూ పోలీసుశాఖలు రెండే పనిచేసేవి. పన్నులు వసూలుచేయడం, ప్రజల్నిఅణిచేయడం ఈ రెండే అప్పట్లో ప్రభుత్వం బాధ్యతలు. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత ఈ పరిస్థితి మారిందన్నారు ప్రణాళికాబద్ధ ప్రగతి, సంక్షేమరాజ్యం వగైరా నినాదాలు పుట్టుకొచ్చాయి. పోలీసులు జిల్లాకలెక్టరు నిరంకుశంగా పాలించిన రోజులు పోయాయన్నారు. నిజమేననుకున్నాం. కాని ఇవ్వాళ మళ్ళీ భూమి గుండ్రంగావుందని రుజువుచేస్తున్నారు. ప్లానింగ్ కమిషన్ అన్నారు, దాన్నిపడుకోబెట్టారు. సంక్షేమరాజ్యం అన్నారు, దాన్ని భోజనంచేసారు. బడుగు వర్గాల ప్రగతి అన్నారు, ఆ ఖర్చు కాంట్రాక్టర్ల పాలుచేసారు. ఇప్పుడిక పోలీసులు అభివృద్ధి కార్యక్రమాలు చేపడుతున్నారు. కలెక్టరు రాజకీయాలు నేర్పుతున్నాడు.

భట్టుపల్లిలోనూ, మల్లారెడ్డిపల్లిలోనూ ఈ కార్యక్రమం మొదలుపెట్టారు. డి.ఐ.జి., కలెక్టరు, ఎస్.పి., వాళ్ళవెనుక సమితిఅధ్యక్షుడు, జిల్లాపరిషత్ ఛైర్మన్ మొన్నటి వరదలకంటె వేగమయిన వాగ్దానాలతో ప్రజలను ఉక్కిరిబిక్కిరి చేసారు. భట్టుపల్లిలో డి.ఐ.జి.గారు ఒకవ్యక్తికీ చౌకదుకాణం డీలర్‌షిప్ ఇచ్చారట (పౌరసరఫరాశాఖ అధికార్లు ఏమయ్యారు ?). ఎస్. పి. వృద్ధాప్యపింఛన్ సర్టిఫికేట్లు, వికలాంగులకు సర్టిఫికెట్లు పంచిఇచ్చారట. (సాంఘిక సంక్షేమశాఖ అధికార్లు ఏమయ్యారు ?) ఛైర్మన్‌గారు 203 మంది విద్యార్థులకు పుస్తకాలు సంచులు దుస్తులు పంచిపెట్టారట. మా నాయకులిచ్చారుగదా అని ఆ పిల్లలు సంబరపడి ఆ సంచులు భుజానికి తగిలించుకొని సాయంకాలంపూట తిరిగేరు— మడికొండ పోలీసులు పట్టుకొని "బాంబులకేసు" పెడతారు జాగ్రత్త ?! మల్లారెడ్డిపల్లిలో కలెక్టరు హరిజనులకు షికం భూమిదున్నుకొమ్మని అనుమతిఇచ్చారట. 160 ఎకరాల సీలింగ్‌భూమి భూమిలేని పేదలకు పంచిఇస్తామన్నారట, చాలాసంతోషం. కాని ఈ కోరికలు కోరినందుకే

గదా వాళ్ళకు తీవ్రవాదులని పేరుపెట్టి నవంబర్ నెలలో ఆ గ్రామంలో పోలీసుక్యాంపు పెట్టి వాళ్ళను చెప్పరాని హింసలకు గురిచేసింది ? గ్రామంలోని పేదప్రజలు కోడు కుంటే "తీవ్ర దళ" ఆయింది, జవహరీగారు పంచిపెడితే వారి మెహర్బానీ అవుతుందా ? ఎవరికోసం ఆడుతున్నారు ఈ నాటకం ?

"శాంతి భద్రతల పరిరక్షణలో పోలీసులు నిష్పక్షపాతంగా వ్యవహరిస్తారనీ ఏ పార్టీకీ ఏ వర్గానికీ అనుకూలంగా వుండరనీ" డిఐజిగారు అన్నారట. ఇదినిజమేనా? భట్టుపల్లిలో అక్టోబర్ నుండి ఇప్పటిదాకా కొనసాగుతున్న పోలీసుక్యాంపు ఎందుకొచ్చిందో మరిచిపోయారా ? అక్టోబర్ 30నాడు ఆ గ్రామంలో రవీందర్ అనే గొల్ల యువకుడు పట్టపగలు హత్యచేయబడ్డాడు. అతని హంతకులు ఇప్పటికీ సురక్షితంగా పోలీసుల పోషణలో వున్నారు. వాళ్ళు ఆత్మరక్షణార్థం రవీందర్ చేతిలోని కత్తి లాక్కొని అతనినే చంపవలసి వచ్చిందని పోలీసులు ఒక పచ్చి బూటకపుకథ సృష్టించి గ్రామంలోని చర్చిలో పోలీసుక్యాంపుపెట్టారు. రాంపురంలో వెంకటమల్లు అనే గొల్ల యువకుడిని హత్యచేసిన వాళ్ళమీద కేసుపెట్టకుండా గ్రామపంచాయతీ ఆఫీసులో క్యాంపుపెట్టి అతని అన్నదమ్ములకోసమే గాలిస్తున్నారు. దీన్ని నిష్పక్షపాతంగా వ్యవహరించడం అంటారా ?

క్యాంపులు ఎందుకు పెడుతున్నారని అడిగితే "తీవ్రవాదుల కార్యకలాపాలను అణచడంకోసం" అని సమాధానం ఇస్తున్నారు. అయితే వాస్తవానికి ఏంచేస్తున్నారో ప్రజలు తెలుసుకోవాలి. భట్టుపల్లినే ఒక మచ్చుతునకగా తీసుకుందాం. క్యాంపుపెట్టి, గ్రామంలోని యువకులకోసం గాలించి యువకులు దొరక్కపోతే వాళ్ళ తండ్రులను తీసుకొచ్చి క్యాంపులో కూర్చోబెడుతున్నారు. మొదట్లో 14 మందిని కూర్చోబెట్టారు. కొందరు నెలపైరోజులు, కొందరు అరవైరోజులు కూర్చున్నారు. ఇప్పటికీ (90 రోజులుగా) ముగ్గురు హరిజనులు ఇంకా క్యాంపులోనే వున్నారు. "రోకలిబండల" దెబ్బలకు వాళ్ళచర్మాలు బండబారిపోయాయి. కిందపడుకోబెట్టి తొక్కారు. గుండ్రంగా కూర్చోబెట్టి ఒకరి చెప్పులతో ఒకరిని కొట్టించారు. వాళ్ళని పొలాలు కోసుకోనియ్యలేదు. కూలిపని చేసుకోనియ్యలేదు. చివరికి స్త్రీలనుసహితం వదిలిపెట్టలేదు. అచ్చమ్మ అనే 50 సంవత్సరాల స్త్రీని ఒకరాత్రింత చితకబాదితే ఆమె వారంరోజులు ఎం.జి.ఎం.లో గడపాల్సివచ్చింది. ఇప్పటికీ లేవలేనిస్థితిలో తన కూతురిదగ్గర ఉంటోంది. డిఐజిగారు ఆమెకుకూడ ఒక వికలాంగుల ఫించను సర్టిఫికెట్ ఇప్పిస్తారా ? ఆమెభర్త (రైల్వేకూలి) ఇంటికిపోతే బ్రతకనిస్తారో చంపు

తారో నని భయపడి కాజీపేట ప్లాట్‌ఫారంమీద బ్రతుకు ఈడుస్తున్నాడు. ఈ నిర్వాసితుడికి డిఐజిగారు ఒక వృద్ధాప్య పింఛను సర్టిఫికేట్ ఇప్పించి పునరావాసం కల్పిస్తారా? అసలు, కొడుకులు దొరక్కపోతే తల్లిదండ్రులను హింసించవచ్చునని ఏ చట్టంలో వుందో సెలవిస్తారా?

క్యాంపులో కూర్చోబెట్టిన వాళ్ళుకాక, మడికొండ లాకప్‌కు తీసుకుపోయి నగ్నంగా రోజులతరబడి కూర్చోబెట్టి మూత్రంతాగించి రోకలిబండలు ఎక్కించి చిత్రహింసలకు గురిచేయబడ్డవారు చాలామంది భట్టుపల్లిలో వున్నారు. ఇప్పటికీ 90 రోజులుగా మడికొండ లాకప్‌లో అక్రమ నిర్బంధంలోవున్న వ్యక్తులు ఇద్దరు ఉన్నారు. ఇది వరంగల్ చరిత్రలోనే అపూర్వమయిన విషయం. 20 రోజులవరకు అక్రమ నిర్బంధంలో ఉంచుకొన్న ఎస్ఐ భారతదేశంలోనే లేడుగాని 90 రోజుల రికార్డు సృష్టించిన ఘనత మడికొండ పోలీసులకే దక్కింది. ఒకపక్క క్యాంపులోనూ మడికొండ లాకప్‌లోనూ వీళ్ళంతా అక్రమ నిర్బంధంలో వుండగానే భట్టుపల్లిలో "అభివృద్ధి కార్యక్రమాల" నాటకం నడిచింది.

ఈ జనవరి మొదటివారంలో వరంగల్ జిల్లాకు సిఆర్‌పిని తీసుకొచ్చారు. అప్పటివరకు ఎపిఎస్‌పి క్యాంపులున్నచోట సిఆర్‌పినిదించారు. వారంరోజులు తిరక్కముందే భట్టుపల్లిలో ఒక సిఆర్‌పి కానిస్టేబులు తాగినమైకంలో నలుగురు స్త్రీల మీద అత్యాచారప్రయత్నం చేసాడు. ఉనికిచెర్లలో ఒక గర్భిణిని కిందపడేసి లాఠీతో పొడిచారు. ఈసారి జిల్లా రెవెన్యూ, పోలీసుఅధికార్లు భట్టుపల్లిలోనో మరేదో దౌర్జన్యపు గ్రామంలోనో బహిరంగసమావేశం జరిపినప్పుడు ఆ స్త్రీలనుగూడ వేదిక ఎక్కించి తమగోడు చెప్పుకోనిమ్మని మేము విన్నవించుకోవచ్చునా? విన్నపం ఎందుకంటే ఇదివరకు పత్రికా విలేకరులకు తమగోడు చెప్పుకున్నవాళ్ళను ఆ రాత్రి మళ్ళీ క్యాంపులోపెట్టి చితగ్గొట్టారు. కాబట్టి ప్రజలభయం తొలగించడానికి గ్రామాలలో క్యాంపులు పెట్టామని డిఐజిగారు అన్నారట. ఎవరయినావింటే నవ్విపోగలరు. గ్రామంలో పోలీసులుంటే ప్రజలకు అభయమో, భయమో మనజిల్లాలో పోలీసు క్యాంపులున్న 20 గ్రామాలలోనూ అడిగితెలుసుకోండి।

37 సంవత్సరాలుగా గ్రామాలలో పేదరికం పెరుకుపోయింది. అధికార యంత్రాంగం అవినీతికి ఆలవాలమయి ప్రజలను పట్టించుకోవడం మరచిపోయింది, నాయకులు తమ కుమ్ములాటలలోనూ కీచులాటలలోనూ కాలంవెళ్లబుచ్చారు. "సమస్య లేవయినా మీకుంటే మా చెవులుపిండి పనిచేయించుకోండి" అని ఛైర్మన్‌గారు అన్నారట. కనీసం చెవులుపిండనిదే నాయకులు పనులుచేయరని ఇంతకాలానికి ఒప్పుకున్నారు, సంతోషం. అయినా ఆ చొరవతీసుకుంటే దాని "తీవ్రవాదం" అంటారని, సెక్షన్ 307 కేసవుతుందని ఛైర్మన్‌గారికి తెలీదా? మన పట్టణంలోని మూడవ

అదనపు మేజిస్ట్రేటు కోర్టులోని (పామరులు దీనిని "నక్సలైట్" కోర్టు అంటారు) సగం కేసులు ఈ బాపతువో ఇటువంటి బాపతువో అని తెలీదా ?

డిసెంబర్ 21నాడు ఆర్ట్స్ కళాశాలలో పోలీసులుజరిపిన హింసాకాండ వరంగల్ ప్రజలు ఎప్పటికీ మరచిపోరు. రెండేళ్ళుగా బస్సులకోసం అడుగుతూంటే పట్టించుకోకుండ చివరికి ఆనాడు సమ్మెచేస్తే పోలీసులు గోడదూకి అరగంటసేపు బీభత్సం సృష్టించారు. నేరంచేసింది పోలీసులయితే అధికారులు విద్యార్థులమీదే విరుచుకుపడ్డారు. కలెక్టరుగాని వి.సి.గాని ఇంతవరకు ఈ లాఠీచార్జీని ఖండించలేదు. ఎందుకు ఖండించలేదని కోపంగా అడిగిన విద్యార్థులను 15 మందిని వి సి. అక్రమంగా సస్పెండ్ చేసాడు. పోలీసులు లాకప్‌లోపెట్టి మళ్ళీకొట్టారు. కలెక్టర్ ప్రిన్సిపాల్స్‌ను సమావేశపరచి చాలా అమర్యాదగా వాళ్ళనుదూషించి ఏకాలేజీలోనూ ఫంక్షన్లు జరగడానికి వీలులేదని శాసించాడు. చివరికి జస్టిస్ పి. ఏ. చౌదరిగారిని అతిథిగా పిలుస్తామన్నా ఒప్పుకోలేదు. కలెక్టర్ దృష్టిలో తానూ డిఐజి తప్ప వరంగల్ లో వేరేఎవ్వరికీ మాట్లాడే హక్కులేదు, వాళ్ళిద్దరూ నన్నయ నుండి నక్సలైట్లదాకా అన్నివిషయాలగురించి మాట్లాడతారుగాని వేరేఎవ్వరు ఏది మాట్లాడినా అది "శాంతి భద్రతల" సమస్య అవుతుంది. చివరికి అన్ని కాలేజీఆవరణల్లోనూ సెక్షన్ 144 ప్రకటించారు. ఇప్పుడిక కాలేజీలలోగూడ "అభివృద్ధి కార్యక్రమాలు" మొదలవుతాయి కాబోలు.

అధికారులూ నాయకులూ తమ నిర్లక్ష్యాన్నీ నిష్ప్రయోజకత్వాన్నీ కప్పిపుచ్చడానికి "తీవ్రవాదం" అనే భూతాన్ని సృష్టించి గ్రామాలను పోలీసులమయం చేసి, ప్రజలను తీవ్రమయిన హింసకు గురిచేసి ఇప్పుడు ఆ గాయాలమీద పన్నీరు చల్లడానికి "అభివృద్ధి కార్యక్రమాల" నాటకం ఆడుతున్నారు. ఇవి నిజంగా నిజాయితీతో తీసుకున్న కార్యక్రమమే అయితే అధికారులకు మాదొక్కసవాల్ స్వీకరించండి. మనజిల్లాలో సారాకాంట్రాక్టర్ల దౌర్జన్యాలగురించి మూడేళ్లుగా ఎందరో ఫిర్యాదులు చేస్తూవున్నారు. ఈమధ్యనే ఒక రిక్షాకార్మికుడిని సారాగూండాలు కొట్టినట్టు రిక్షా కార్మికసంఘం నాయకుడు ఆరోపించాడు. ఇంతయినా సారాకాంట్రాక్టర్ల స్వైరవిహారం నడుస్తూనేవుంది. గూండాలతో నిండిన వాళ్ళజీపులు వ్యాన్లూ నిత్యం బాహాటంగా తిరుగుతూనేవున్నాయి. జిల్లాఅధికారులు ఇకనయినా వాళ్ళ ఆగడాలను ఆపుతారా, లేక ఇంకొంతకాలం ఉపేక్షించి ప్రజలలో ఎవరయినా తిరగబడి వాళ్ళమీద ఒకచర్య తీసుకుంటే వాళ్ళమీదికి పోలీసులను దించి అమానుషంగా హింసించి ఆ పిదప "అభివృద్ధి కార్యక్రమాలు" అంటూ బూటకపు నాటకంఆడతారా ? !

ఫిబ్రవరి 1984
వరంగల్ జిల్లా. — ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం

## రచయితలారా, పల్లెప్రజలతో కలిసిపోండి

మీరు ప్రజలభాషలు బాధలు ఎందుకు తెలుసుకోలేక పోతున్నారు అంటే మీరు ప్రజలలోకి వెళ్ళటంలేదని అర్థం. మరి ప్రజలలోకి వెళ్ళినపుడేగదా ప్రజల భాషలో వ్రాయగలిగేది. మీరు పట్టణాల్లో పట్టణప్రజానీకంలో కలిసిపోగానే సరిపోదు కదా. మరి పల్లెలకు వెళ్ళినపుడే పల్లెప్రజానీకంలో కలిసినపుడే మీరు ప్రజాభాషలో మాట్లాడగలిగేది. మరి మీరు ఆ రకంగా ఎందుకు చేయటంలేదు. వడ్డెపల్లి, భట్టుపల్లి కామేేడ్స్ సృజన మాకుఅర్థమౌతలేదు. అందులోనిపదాలు వాలాగట్టిగా వున్నవి అని అంటున్నారు. వాళ్లు ఎందుకు ఆ రకంగా అంటున్నారో మీరు ఆలోచించవలసిన విషయం. మరి పట్టణం పక్కనవున్న గ్రామప్రజలకే అర్థముకానపుడు అడవిలోవున్న గోండుప్రజానీకానికి ఏమి అర్థమౌతది. ఇది మీరు ఆలోచించదగ్గ విషయం. కా॥ వరవరరావుగారు సముద్రంఅనే పుస్తకంవ్రాసారు. అది ఏ పల్లె ప్రజానీకానికి అర్థమౌతున్నది. అసలు పట్టణాల్లోవున్న ప్రజానీకానికే అర్థంకానపుడు పల్లెప్రజలకు ఎలా అర్థమౌతది. పల్లెప్రజలు మేధావులనుకున్నారా లేక కవులనుకున్నారా. పుస్తకాలు వ్రాయగానేసరిపోదు, అందులోని పదాలు ప్రజలకు అర్థమయేలా వుండాలి. అపుడే ప్రజానీకం ఆ పదములోని అర్థమేమిటో తెలుసుకోగలుగుతారు. చైతన్యవంతులవుతారు. మరి ఒకవైపున పోలీసుకుక్కలు పల్లెజనం మీద పడి తీవ్ర చిత్రహింసలు పెడుతుంటే నిర్బంధం భరించలేక కుటుంబాలు నాశనంఅవుతుంటే మీరు వుండి ఏమిచేస్తున్నట్లు. మరొక్కవైపున వందలాదిమందిని అక్రమకేసులుపెట్టి జైలులోపెట్టుతుంటే కండీషన్ బెయిలుమీద బయటికివచ్చిన కామ్రేడ్లను లాకప్‌లోపెట్టి ఎట్టిచాకిరి చేయిస్తుంటె మీరు ఏమిచేస్తున్నట్లు. అసలుమీరు క్యాంపెయిన్‌చేసి తెలుసుకుంటెకదా మీకుతెలిసేది. పట్టణాల్లోకూర్చుంటే తెలుస్తుందా.

అందుకనే ఏమంటామంటే "నేరమే అధికారమైతే నోరువుండి వూరుకున్న ప్రతిమనిషీ నేరస్తుడే"అని అంటాము. ఎందుకంటె మనము విప్లవకారులము కాబట్టి. మరిపల్లెలో పల్లెజనం ప్రజలభాషలో ఎంతచక్కగా రాయగలుగుతున్నారు. మీరేమొ మేధావులు. మీరు ఆ రకంగావ్రాయటంలేదు. మీరు పల్లెజనంలోకి వెళ్ళినపుడే మీరు వారికంటెకూడ చాలచక్కగా ప్రజలభాష మాట్లాడగలుగుతారు. మీ తోటి కరీమ్‌నగర్ విరసంవాళ్లు పల్లెజనంలోకివెళ్ళి ప్రజలభాషలో నవలలు వ్రాయడంలేదా మరి మీరు ఆ రకంగా ఎందుకుచేయటంలేదు. వాళ్ల క్యాంపెయిన్

చేస్తున్నారు. పల్లెలకు వెళ్లుతున్నారు. ప్రజలభాష నేర్చుకుంటున్నారు. ప్రజలభాషలో మాట్లాడగలుగుతున్నారు. మరి మీరు ఎందుకు ఆ రకంగా చేయటంలేదో అనిపిస్తుంది.

కా॥ మావో ఏమని చెప్పాడు. "సరియైన విప్లవకారుడు ఎవరంటే అశేష ప్రజానీకం కష్టసుఖాల్లో భాగం పంచుకున్నవాడే సరియైన విప్లవకారుడు" అని చెప్పాడు.

విప్లవాభినందనలతో

నారాయణ

## ప్రజల నుంచి ప్రజల్లోకి

భట్టుపల్లి, వడ్డెపల్లి- రాడికల్ యువజనసంఘాల సభ్యులు రాసిన పుత్తరాల్లోని అంశాలు తప్పక ఆలోచించాల్సినవని నాకనిపిస్తోంది. ముఖ్యంగా తాత్వికమైన శాస్త్ర విశ్లేషణలు సృజనలో ఉన్నంతలో తేలికగా చెప్పడానికి ప్రయత్నాలు జరుగుతున్నా యీ వుద్యమానికి వెన్నెముకలైనవారికందడానికి యింకా తేలిగ్గా చెప్పాల్సిన అగత్యం వుందని ఆ పుత్తరాలు తెలుపుతున్నాయి. ఇది వాస్తవమే మరి.

ఈ వాస్తవం నుంచి నాకు తోస్తున్నదేవిటంటే సృజన సంపాదకులూ- రచయితలూ విషయ విశ్లేషణ నింకా తేలిగ్గా తెలియజెప్పడం ఎలా ? అన్న తపనతో వారి ప్రయత్నాలు సాగవల్సివున్నట్టే అదే సమయంలో సృజన పాఠకులైనవారు కొరుకుడు పడని ఆ విషయాల్ని ఒకటికి పదిసార్లు చదివి అవగాహన చేసుకుందికి ప్రయత్నించడం; అప్పటికీ కొరుకుడుపడని అంశాలువుంటే స్టడీగ్రూప్స్ మాదిరిగా వారిలోవారే ఏర్పడి చర్చించుకోడం; అప్పటికీ అవగాహనలేని అంశాల్ని యిలా సంఘపరంగా పత్రికకి రాసి తెల్సుకోడం- నిర్విరామక్రమంలో సాగడం మంచిదని నాకనిపిస్తోంది. ఈ క్రమంవల్ల పాఠకులకి కొరుకుపడని అంశాలు ఏమిటో సంపాదకులకీ- ఆ పత్రిక రచయితలకీ కూడా తెలుస్తుంది. అది వారినివారు ఎక్కడ సరిదిద్దుకోవాలో తెల్సుకుందుకి దోహదం చేస్తుంది. అలాగే పాఠకులు అర్థంకాని విషయాలను తెల్సుకుందికి కేంద్రీకరణశక్తిని పెట్టడంవల్ల జటిలమైన ఆ అంశాల్ని అర్థం చేసుకోగలశక్తి పెరుగుతుంది. కొంతకాలానికైనా యీ అగాథం సాధ్యమైనంతగా పూడడానికి యిరుపక్షాలా యీ ప్రయత్నాలు తప్పవేమోనని నాకనిపిస్తోంది. మీరు - పాఠకులు ఆలోచిస్తారని నాకనిపించినదాన్ని మీకు రాస్తున్నా.

అలాగే కవితలకి, కథలకి, వ్యాసాలకి ప్రాధాన్యంయిస్తున్నట్టే వారు పుత్తరాల్లో చెప్పినట్టుగా ఆయా గ్రామాల్లో సాధిస్తున్న అంశాల్ని ఏదో ప్రక్రియలోకి వెంటనే మల్చిగాని- లేదా సమాచారంగా గాని కొన్ని పేజీలు కేటాయించడం మంచిదేమో- ఆలోచించండి.

— కాకరాల

9 రగులుకొనే రాక్షసిబొగ్గు జాతులసమస్య - ఒక దృక్పథం
కె. ప్రసాదరావు 0.75

0 మునుముందుకు సాగుతున్న రైతాంగ పోరాటాలు
చుట్టుముడుతున్న ప్రభుత్వ నిర్బంధకాండ ! 3.00

1 మలయా కమ్యూనిస్టుపార్టీ రెండు చారిత్రిక పత్రాలు 1.50

2 తెలుగుదేశం ప్రభుత్వ ఫాసిస్టుదాడిని ప్రజలు సమైక్యంగా త్రిప్పికొట్టాలి 0.50

3 పార్టీలో తప్పుడు అభిప్రాయాలు సరిదిద్దుట - మావో 0-50

ఐ ఎల్ ఆర్ సి ప్రచురణలు

AILRC Souvenir 15 00

Hail Revolution (Poetry Athology) 15-00

రత కమ్యూనిస్టుపార్టీ (మార్క్సిస్టు-లెనినిస్టు) పీపుల్స్‌వార్ ప్రచురణలు

ఆధునిక రివిజనిస్టు డెంగ్ ముఠాకు వ్యతిరేకంగా పోరాడండి 2-00

వ్యవసాయక విప్లవం 2-50

'విమోచన' పార్టీ నాయకత్వపు మితవాద అవకాశవాద దివాళాకోరు
రాజకీయాలను ఓడించండి ! 4-00

ర ప్రచురణలు

కొ.కు. సాహిత్య సమాలోచన - ప్రగతిసాహితి, ఢిల్లీప్రచురణ 10-00

అల్లం వీరయ్య పాటలు 1-50

సృష్టికర్తలు - కథలు - అల్లం రాజయ్య 5-00

పాట వెన్నెలమీద నడుస్తుంది - కవితలు - అజ్ఞాతసూరీడు 3-00

సముద్రం - కవితలు - వరవరరావు 2-00

బతుకుపోరు - నవల - బి. ఎస్. రాములు 5-00

సుద్దాల హనుమంతు పాటలు 4-00

లాల్ బనో గులామీఛోడో - బోలోవందేమాతరం - ఎన్. కె. 1-00

అనామకుడి డైరీ - కథలు - కె. రాంమోహన్‌రాజు 5-00

చర్య - కవితలు - సాగర్ 2-00

భూమి - కథలు 5-00

తెలంగాణ విమోచనోద్యమం - తెలుగు నవల వరవరరావు - సాదా : 35.00
మేలు : 50-00

భారత కార్మిక ఉద్యమచరిత్ర - కె. బాలగోపాల్ 0-50

ప్రజాస్వామిక సంస్కృతి సొసైటీఫర్ సోషల్‌ఛేంజ్ 3.50

Saharjari : A bandoned Miners of
Santhal Parganas FUDR 2.00

Anonymous Struggles PUDR 2-00

And Queit flows the Ganges PUDR 1-00

ṢRJANA Telugu Monthly February '84 - H/HNK-3
Regd. No. with Registrar of Newspapers 10953/67

సృజన ప్రచురణలు :

| | | |
|---|---|---|
| 1 | నా కుటుంబం నవల టాప్‌చెంగ్ | 4.00 |
| 2 | ఉప్పెన నవల చౌలి-పో రెండవభాగం | 6.00 |
| 3 | ఉద్యమం నెలబాలుడు కవితలు శివసాగర్ సాదా : | 5-00 |
| | మేలు : | 10.00 |
| 4 | ప్రజాసాహిత్యం, కళలు ఎలావుండాలి ? - వర్గీస్‌వ్యాసాలు | 2.00 |
| 5 | శ్రీశ్రీ పై సృజన సప్లిమెంట్ | 1.00 |

విరసం ప్రచురణలు :

| | | |
|---|---|---|
| 1 | కత్తిపాట - చెరబండరాజు పాటలు | 4.00 |
| 2 | గాయాలు మేల్కొంటున్నాయి - నాటికలు - నాటకాలు - చెరబండరాజు | 8.00 |
| 3 | గంజినీళ్ళు - నాటిక - చెరబండరాజు | 1.50 |
| 4 | పోరాటాల శ్రీరాములు - పరిటాల | 0-75 |
| 5 | గతితార్కిక భౌతిక మానవతావాదం - త్రిపురనేని | 2-00 |
| 6 | అగ్నికణం - నవల - అల్లం రాజయ్య | 6.00 |
| 7 | కళలూ - సారస్వతం ఎవరికోసం ? - మావో | 1-00 |
| 8 | Raging storm (Poetry anthology) | 15.00 |
| 9 | లూసున్ సాహిత్య జీవితం | 1.25 |
| 10 | Sword Song - Cherabanda Raju Indian | 10-00 |
| | Foreign | U S $ 1/- |

క్రాంతి ప్రచురణలు :

| | | |
|---|---|---|
| 1 | యుద్ధం - శాంతి లెనిన్ | 4-00 |
| 2 | నూతన ప్రజాస్వామికం మావో | 1.75 |
| 3 | ఆచరణ మావో | 1-00 |
| 4 | లాంగ్‌మార్చ్ చైనాకథలు | 6.00 |
| 5 | రష్యాలో వర్గపోరాటాలు బెతుల్‌హామ్ | 1-50 |
| 6 | ఏం చేయాలి ? లెనిన్ | 4.50 |
| 7 | పోలెండు కార్మికోద్యమం - ఒక పరిశీలన | 0.75 |
| 8 | ప్రజాయుద్ధం వర్ధిల్లాలి | 1-50 |

(మిగతా 3వ కవర్‌లో)